# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ సంచికతో "విచిత్ర కవలలు" రంగుల బొమ్మల సీరియల్ పూర్తి అవుతున్నది. వచ్చే సంచిక నుంచి కొత్త సీరియల్ ప్రారంభమవుతుంది.

ఈ నెల బేతాళకథ ["తండ్రికి తగనివాడు"] బూర్లె నాగేశ్వరరావు రచన. మంచితనం నిలబెట్టుకో గలందులకు కష్టాలకు గురి కావటమే నిజమైన మంచితనం. "కలిమి–లేమి", "తీర్పురద్దు", లాటి చిన్న కథలలో కూడా ఈ నీతి కనబడుతుంది.

---

సంపుటి 57 డిసెంబర్ '75 సంచిక 6






## 30

కరటకం దమనకానికి చిలుకల కథ చెప్పి, "నువు ఈ పని అంతా నీ మిత్రుడైన సింహం కోసం చేశానని సమర్థించవచ్చు. కాని నన్ను ఒక్క విషయం చెప్పనియ్యి: మూర్ఖుడైన మిత్రుడి కన్న వివేకంగల శత్రువు మేలు. ఇందుకు తార్కాణంగా ఒక దొంగ తన ప్రత్యర్థుల కోసం చచ్చాడు. ఒక కోతి తన మిత్రుడైన రాజును చంపింది," అన్నది.

"అది ఎలా జరిగింది?" అని దమనకం అడిగింది.

కరటకం ఆ కథ ఇలా చెప్పింది:

పూర్వం కౌశాంబీ రాజ్యంలో ఒక రాజకుమారుడు ఉండేవాడు. అతను అస్తమానమూ బ్రాహ్మణమంత్రి కొడుకుతోనూ, వైశ్యకోశాధికారి కొడుకు తోనూ తిరిగేవాడు. వాళ్ళు ఆప్తమిత్రులుగా ఉంటూ, వినోదాలతోనూ, క్రీడలతోనూ వాహ్యాళితోనూ, ప్రసంగాలతోనూ కాలక్షేపం చేసేవాళ్ళు.

ఈ సాంగత్యం వల్ల రాజకుమారుడికి విలువిద్యగాని, కత్తిసాముగాని, అశ్వగజారోహణలుగాని ఇతర క్షత్రియ విద్యగాని కొంచెమైనా అబ్బలేదు.

"రాచవిద్యలేవీ నేర్చావు కావు, ఎలా రాజరికం నెరుపుతావురా?" అని రాజు తన కొడుకును ఒక నాడు అడిగాడు.

ఈ మాట అనిపించుకున్నందుకు రాజకుమారుడు చాలా నొచ్చుకుని, తన మిత్రులతో ఈ మాట చెప్పాడు.

దానికి వాళ్ళు, "మా తండ్రులు కూడా అస్తమానమూ మమ్మల్ని ఇలాగే తప్పు పట్టుతున్నారు. కులవిద్యలు నేర్చుకోక మేం ఎందునాకాకుండా పోతున్నామట.

అట్ట చివరి బొమ్మ

ఇప్పుడు నీకు కూడా అలాటి అవమానమే జరగటం చూసి అందరికీ దుఃఖంగానే ఉన్నది,'' అన్నారు.

రాజకుమారుడు ఇలా అన్నాడు:

''అవమానం జరిగిన చోట నిలవ రాదు. మన ముగ్గురినీ పెద్దవాళ్ళు అవమానించారు. మనం ఎటైనా వెళ్ళి పోయి, మన మీద వచ్చిన ఆరోపణలు అసత్యమని నిరూపించుదాం.''

ఇందుకు మిగిలిన ఇద్దరూ సరే నన్నారు. అయితే, ఎక్కడికి వెళ్ళాలన్న ప్రశ్న వచ్చింది. ముగ్గురూ చాలాసేపు వితర్కించిన మీదట కోశాధికారి కొడుకు ఇలా అన్నాడు:

''ధనం లేక మనం ఏదీ సాధించలేం. మనం రోహణ పర్వతం మీదికి వెళదాం. అదృష్టం ఉంటే అక్కడ మనకు ఎంతో విలువైన ఇంద్రనీల మణులు దొరకవచ్చు. వాటితో మన ఆశయాలన్నీ సిద్ధిస్తాయి.''

ఇందుకు మిగిలిన ఇద్దరూ ఒప్పుకున్నారు.

పుష్కలంగా ధనం తీసుకుని ముగ్గురూ రోహణపర్వతానికి ప్రయాణమయారు. అదృష్టం కలిసి వచ్చి, వాళ్ళు శ్రమపడి వెతికిన మీదట, ఒక్కొక్కరికీ ఒక్కొక్క వెలలేని ఇంద్రనీలమణి దొరికింది.



''అరణ్యమార్గం క్షేమకరం కాదు గదా. మనం ఈ రత్నాలతో ఎలా తిరిగి పోవటం?'' అని వాళ్ళు ఆలోచించారు.

''నేను మంత్రి కొడుకును గనక, ఇలాటి సమస్యలను పరిష్కరించటం నాకు తెలుసు. దీనికి ఉపాయం నేను ముందుగానే ఆలోచించాను. మనం మన రత్నాలను అన్నం ముద్దలలో పెట్టి మింగేద్దాం. అవి మన పొట్టలలో భద్రంగా ఉంటాయి. వాటిని ఏ దొంగలూ వెతికి తీసుకోలేరు. మనం ఎల్లుండికి రత్నపురం చేరుతాం. అక్కడ మనం ఆమదం తీసుకుని రత్నాలను వెలికి తెప్పించుదాం,'' అన్నాడు మంత్రికొడుకు.

మిగిలిన ఇద్దరికీ ఈ ఉపాయం నచ్చింది. ముగ్గురూ భోజనంతోబాటు తమ తమ ఇంద్రనీలాలను మింగేశారు.

సుబుద్ధి అనేవాడు ఈ ముగ్గురికీ కన పడకుండా ఒక పల్లపు ప్రదేశంలో ఉండి, మంత్రికొడుకు మాటలు విన్నాడు; ముగ్గురూ ఇంద్రనీలాలు మింగటం చూశాడు. వాడు కూడా ఇంద్రనీలాల కోసం ఆ కొండకు వచ్చినవాడే!

"ఈ ముగ్గురి అదృష్టమూ ఎలాటిదో గాని, వీళ్ళకు అద్భుతమైన మణులు దొరికాయి. నేను కూడా వీళ్ళతో చేరి ప్రయాణం చేసి, రాత్రిపూట వాళ్ళు అలసి గాఢనిద్రలో ఉన్నప్పుడు ముగ్గురి పొట్టలూ కోసి, మూడు మణులూ తీసు కుంటాను," అనుకున్నాడు సుబుద్ధి.

ఇలా అనుకుని వాడు ఒక అరమైలు దూరం ముందుకు నడిచి, అక్కడ ఆగాడు. త్వరలోనే ముగ్గురూ అటుగా వచ్చారు. అప్పుడు సుబుద్ధి వాళ్ళతో, "మిత్రులారా, ఈ భయంకరమైన అరణ్యాన్ని ఒంటరిగా దాటాలంటే భయంగా ఉన్నది. మాది రత్నపురం. నేను అక్కడికే పోతున్నాను. దయచేసి నన్ను మీ వెంట రానిస్తారా?" అన్నాడు.

మరొకడు తోడు ఉంటే మరింత బాగుంటుందని వాళ్ళు సుబుద్ధిని తమ వెంట రానిచ్చారు.

ఆ మహారణ్యం మధ్యన, దారిని అను కుని ఒక దొంగల పల్లె ఉన్నది. దొంగల నాయకుడి ఇల్లు దారిమీదికే ఉన్నది. వాడి వద్ద అనేక పక్షులున్నాయి. అందులో ఒక పక్షికి, దారే వెళ్ళేవాళ్ళను గురించి తెలుసుకునే అద్భుతశక్తి ఉండేది. నలుగురు బాటసార్లు దొంగలనాయకుడి ఇంటిముందు నుంచి వెళుతూండగా ఆ పక్షి గొంతు చించుకుని అరిచింది.

దాని భాష తెలిసిన దొంగలనాయ కుడు తన నౌకర్లను పిలిచి, "ఆ వెళ్ళే వాళ్ళ దగ్గిర రత్నాలున్నాయని పక్షి చెబుతున్నది. వాళ్ళను పట్టుకోండి!" అన్నాడు.





## 18

[రాక్షసుడి అనుమతితో ఉదయునుణ్ణి వెతుకుతూ, నిశీధుడు బయలుదేరాడు. ఈ లోపల పాతాళగృహంలో వున్న ఉదయనుడు, విషసర్పాలు కాపలా కాస్తున్న కొన్ని ద్వారాలు దాటి, ఒకచోట రాక్షసుడు పూజించే దేవీవిగ్రహాన్ని చూస్తూనే, విగ్రహం నొసటి నుంచి వెలువడుతున్న పొగలోచిక్కుకుని, దారికానక ఉక్కిరిబిక్కిరయాడు. తరవాత—]

ఉదయనుడు భయకంపితుడైపోయి, యిక తనకు చావు తప్పదనుకునేంతలో, హఠాత్తుగా పొగ మాయమైపోయింది. ఆ వెంటనే రకరకాల ధ్వనులతో దేవీ విగ్రహం వున్న గుహ అంతా మార్మోగ సాగింది. ఉదయనుడు యిప్పుడు ధైర్యం తెచ్చుకుని, దేవీ విగ్రహం ముందు నిలబడి, "తల్లీ! ఇందరు అమాయకుల ప్రాణాలను బలి కోరటం ఏం న్యాయం? ఆ దుర్మార్గుడైన రాక్షసుడికి, మరింత బలం ప్రసాదించటంలో, లోకానికి జరిగే మేలేమిటి, తల్లీ?" అన్నాడు.

దేవి ఉలకలేదు; పలకలేదు. ఉదయనుడు ఒక క్షణం ఆగి, "తల్లీ! ఇంత వరకూ నిద్రాహారాలు లేక పడరాని కష్టాలు పడ్డాము. ఆ రాక్షసుణ్ణి హతమార్చాలి. వాడి ప్రాణాలెక్కడున్నాయో చెప్పి పుణ్యం కట్టుకో!" అన్నాడు.




దేవి, యీ కోర్కెకూ సమాధానం చెప్పలేదు. ఇది పనిగాదని ఉదయనుడు, దేవి చేతిలో వున్న గద్దను తన కత్తితో ఒక్క వేటుకు నరికి వేశాడు. గద్ద శాస్త్రా అగ్నిగుండంలో పడింది. దేవి విగ్రహం మాయమై, ఆ ప్రదేశమంతా వెలుగుతో నిండిపోయింది.

ఉదయనుడు గిరుక్కున వెనుదిరిగి చూశాడు. అంతకు ముందు తను దాటి వచ్చిన ద్వారాలూ, గదులూ ఏవీలేవు. అంతా ఒక ఎడారిలా తయారైంది.

ఉదయనుడు తిరుగు ముఖం పట్టాడు. అంతకు ముందు రత్నాలద్వారం వున్న చోట, రత్నాలతో పొదగబడిన ఒక బాతు గుడ్డు వంటి గుడ్డు కనిపించింది. దానిని తీసుకుని మరికొంత దూరం వచ్చేసరికి, అలాంటిదే వెండి గుడ్డు కనిపించింది. అదీ తీసుకుని మరికొంత దూరం వెళ్ళే సరికి, బంగారుగుడ్డు కనిపించింది. దానినీ తీసుకుని ముందుకు సాగేసరికి, గడ్డపు వాడు వేళ్ళాడ దీయబడిన గది కూడా కనుపించకుండా పోయింది.

ఉదయనుడు విస్తుపోతూ పాతాళం లోంచి బయిటికి వచ్చాడు. అప్పుడే రాక్షసుడి సేవకులు వచ్చి చుట్టు ముట్టారు. వాళ్ళతోపాటు కొలనులో హంసల రూపంలో వుంటున్న వాళ్ళు కూడా మామూలు స్వరూపాలు పొంది వచ్చే శారు. సోదరుడు కనబడగానే సంధ్య ఒక్క పరుగున వచ్చి కౌగలించుకున్నాడు.

ఇంతలో రాక్షసుడి సేవకులు ఉదయనుడిని అమాంతం భుజాల పైకి ఎక్కించుకుని, "నీవు దేవుడివే, మా రాజా! నీ ధర్మమా అని, ఇన్నాళ్ళకు మాకు ముక్తి దొరికింది!" అన్నారు.

ఒకడు ఉదయనుడి మొండిచేతి నుంచి కారుతున్న రక్తం చూశాడు. వాడు వెంటనే, "చూస్తారేమ్రా! పసరు తెండి," అని కేకవేశాడు.

ఒకడు పసరు తెచ్చి ఉదయనుడి చేతికి రాచి కట్టుకట్టాడు. అప్పుడు ఉదయనుడు

వాళ్ళ నందరినీ తీసుకుని, కొలను వైపుకు వెళ్ళాడు. తీరా చూడగా అక్కడ కొలనులేదు, శిలలుగా మారిపోయిన దురదృష్టవంతుల ప్రతిమలు మాత్రం నిలిచివున్నై.

ఉదయనుడు వెంటనున్న వాళ్ళను, "కొలను ఏది?" అని అడిగాడు.

"ఇంకా కొలను ఎక్కడుంటుంది, బాబూ! దేవి మాయంకావటంతో అన్నీ మాయమైపోయినై," అన్నారు వాళ్ళు

"మరైతే, యీ శిలా ప్రతిమల గతేమిటి?" అన్నాడు ఉదయనుడు.

"వాళ్ళ గతి అంతే! కొలను కాస్తా పోయె. వాళ్ళకు మామూలు స్వరూపాలు ఎలా వస్తవి?" అన్నారు సేవకులు.

"అయ్యో, ఎంత దారుణం! నిష్కారణంగా యిందరి ప్రాణాలు హరించి పోవటానికి కారకుణ్ణయానే," అంటూ విచారించసాగాడు ఉదయనుడు.

అటు తరువాత, "సోదరుడు నిశీధుడు ఏమయ్యాడో! ఆ గడ్డపు వాడు ఏమయ్యాడో! రాజకుమార్తె లేమయ్యారో తెలియలేదు. ఆ సంగతులన్నీ తెలుసుకోవాలి," అన్నాడు ఉదయనుడు.

"మరి పదండి!" అన్నారు సేవకులు.

"అలా కాదు. మీరంతా యిక్కడే వుండండి," అని వాళ్ళనక్కడ కాపలా



పెట్టి, సంధ్య, యితర పరివారాన్నీ తీసుకుని, వెంటనే ఉదయనుడు బయలుదేరాడు. ముందుగా అతడు ప్రతాపసింహుడి రాజ్యం చేరి భోగట్టాచేశాడు.

"అబ్బే, ఎవరూ రాలేదు. నీవు అప్పుడు వెళ్ళటం, నిన్ను మళ్ళీ యిప్పుడే చూడటం. ఆ రాక్షసుణ్ణి తప్పించుకుని ఎలా వచ్చావోయ్?" అని ప్రశ్నించాడు ప్రతాపుడు.

"వాడి సంగతే తెలియలేదు. అయితే, వాడి మాయా భవనం మాత్రం మట్టి పాలు చేసి వేశాను. నా సోదరుడూ, రాజకుమార్తెలూ ఏమయారో తెలుసుకోవాలి," అన్నాడు ఉదయనుడు.



"కావాలంటే, నా పరివారాన్ని కూడా పంపుతా," అన్నాడు రాజు ఎంతో దయతో.

"మీ అభిమానం వుంటే చాలు," అంటూ ఉదయనుడు, రాజు వద్ద సెలవు తీసుకుని, మళ్ళీ పరివారంతో సాగిపోయాడు.

* * *

రాజు ప్రతాపసింహుడి మాట నమ్మి, అతడి సేవకులను నిశీధుడు వెంట తీసుకుపోవటం ప్రమాదకరమే అయింది. అదను చూసి ప్రతాపుడి సేవకులు, నిశీధుడి తల తెగవేసి, అరణ్యంలో పారవేసి చక్కాపోయారు. మరునాడు, అ చుట్టు ప్రక్కల ఆశ్రమంలో వుంటున్న ఒక ఋషీశ్వరుడు, ఆ దారిన వస్తూ, నిశీధుడి తలా, మొండెమూ చూచాడు. వాటిని తన ఆశ్రమానికి చేర్చి, వాటికి సంబంధించిన వాళ్ళెవరైనా వస్తారా అని ఎదురు తెన్నులు చూస్తూ వున్నాడు.

కొద్దిరోజులకే దానశీల మహారాజు పంపిన ఆయన మంత్రి, ఈ ఋషీశ్వరుని ఆశ్రమం చేరుకోవటం తటస్థించింది. నిశీధుని తలా, మొండెమూ చూచి గుర్తుపట్టాడు. "అయ్యో, ఇదేమి ఘోరం!" అంటూ గుండెలు బాదుకున్నాడు మంత్రి.

"నాయనా, విచారించి ప్రయోజనం లేదు. దుఃఖించకు. నేనూ, నీ వెంట వస్తాను. కలిసిపోదాం, పద. నేను చేయగల ఉపకారమల్లా ఒకటే; ప్రాణం పోయటం నా చేతకాదు. కాని ఎంత కాలమైనా సరే, యీ కళేబరము చెడిపోకుండా నిలవ చేయగలను," అని మంత్రిని ఓదార్చాడు ఋషీశ్వరుడు.

"అంతకంటె కావలసిందేమున్నది! ఈ ఆపద సమయమందు మీరు దేవుడిలాగా వచ్చారు. మనం ఈ స్థితిలో శ్రావస్తీనగరం చేరుకుంటే చాలు. తరవాత సంగతి ప్రభువులే ఆలోచించగలరు." అన్నాడు మంత్రి.

ఋషీశ్వరుడూ, మంత్రీ కొద్దిరోజుల్లో శ్రావస్తీనగరం చేరారు. నిశీధుడి కళే



బరం చూసి అందరూ కొయ్యబారి పోయారు. సంధ్య, ఉదయనుడూ, వాళ్ల ముసలి తల్లీ పేగులు తరుక్కుపోయేట్టు విలపించసాగారు. ఈ స్థితిలో గడ్డపువాడు అక్కడికి వచ్చాడు.

గడ్డపువాడు చాలా విచిత్ర పరిస్థితుల్లో అక్కడికి చేరుకోవటం జరిగింది. రాక్షసుడికి వాడంటే ఎప్పుడూ అనుమానమే. తన మాయా భవనంలో వదిలిపోతే, ఏదో ముప్పు తెస్తాడని అతడు భావించాడు. అందువల్ల రాక్షసుడు సంచారానికి బయలుదేరినప్పుడు గడ్డపువాణ్ణి తనవెంట తీసుకుపోయాడు.

ఆ పరిస్థితుల్లో ఒకరోజున రాక్షసుడు, గడ్డపువాడితోపాటు ఆకాశమార్గాన సంచరిస్తున్నాడు. దిగువ అంతా మహా సముద్రం. సరిగా అదే సమయంలో ఉదయనుడు, దేవిచేతిపైన ఉండే గద్దను పడగొట్టటం జరిగింది. ఇక్కడ ఉదయనుడు గద్దను పడగొట్టటమేమిటి, ఆకాశ మార్గాన గద్ద రూపంలో వున్న రాక్షసుడు నిజరూపం పొంది, ఒక చావు కేకపెట్టి, సముద్రంలో పడి మరణించటం ఏమిటి- రెండూ ఒకేసారి జరిగాయి.

రాక్షసుడితోపాటు సముద్రంలో పడిన గడ్డపువాడు మాత్రం, రెండు రోజులపాటు శ్రమపడి సముద్రం యీది, చివరకు కొన ప్రాణాలతో ఒడ్డుకు చరుకోగలిగాడు. వాడు గజ ఈతగాడు.

మాయాభవనం మట్టి పాలయిందనీ, ఇక ఏ విధమైన బాధలూ వుండవనీ, గ్రహించాడు గడ్డపువాడు. తను చేరుకున్న సముద్ర తీరపు నగరం ఏదో అక్కడి వాళ్ళను అడిగి తెలుసుకున్నాడు. అది శ్రావస్తీనగరం అని తెలుసుకోగానే, అతడి ఆనందానికి మేరలేకపోయింది.

గడ్డపువాడు ఉత్సాహంగా రాజభవనం ప్రవేశించేసరికల్లా, అక్కడ ఏడుపులూ పెడబొబ్బలతో, అంతా గోలగా వున్నది.

గడ్డపువాడు శత్రువులు వేసిన ఎన్నెన్నో వ్యూహాలను ఛేదించినవాడు. ఖ్యాతి



పొందిన రాక్షసుడి చేతిలో మసలిన వాడు. మామూలు మానవులలాగా ప్రతి విషయంలోనూ అధైర్యం చెందడు. అతను అందరినీ ఊరడిస్తూ, "ఇప్పటివరకూ అంతా సవ్యంగానే నడిచింది, కంగారు పడవద్దు," అన్నాడు.

గడ్డపువాడు, ఉదయనుణ్ణి చేరబిలిచి, "అబ్బాయీ, ఇదంతా ప్రతాపసింహుడి కుట్రేగాని, వేరుగాదు. భస్మాలూ, అంజనాలూ వాడే కాజేసి వుంటాడు. ముందు వాటిని తిరుగా చిక్కించుకోవాలి. ఈ పని చూడు," అన్నాడు.

ఉదయనుడు క్షణమైనా నిలవలేదు. దానశీల మహారాజుగారి సైన్యాన్ని తీసుకున్నాడు. గడ్డపువాడిని వెంటబెట్టుకుని, మాళవ రాజ్యం చేరుకున్నాడు. నగరం చూడబోతే పందిళ్ళతో, పచ్చటి తోరణాలతో కళకళ్ళాడుతూ వున్నది. ఈ వేడుకంతా ఏమిటని భోగట్టాచేయగా, ప్రతాప మహారాజులుంగారికి ఒక్కసారిగా ముగ్గురు మహారాణులు కాబోతున్నారని అబ్బురంగా చెప్పుకుంటున్నారు అందరూ.

గడ్డపువాడు చేసిన సూచనలు అక్షరాలా నిజమయేటట్టుగానే తోచింది ఉదయనుడికి. ఆశ్చర్యంతో వాళ్ళు మహలు ప్రవేశించారు. పెళ్ళిపీటల మీద వరసగా సుహాసినీ, సుభాషిణీ, సుకేసినీలు ముగ్గురూ తీర్చి కూర్చుని వున్నారు. కులుకుతూవున్న ప్రతాపుడు మూడు మంగళ సూత్రాలు చేతపట్టుకొనివున్నాడు.

ఉగ్రమూర్తి అయినాడు ఉదయనుడు. ఒక్కలిప్తలో బాకు దూశాడు. కాని, గడ్డపువాడు అడ్డుకున్నాడు. అంతలోనే సైన్యమంతా ముట్టడివేసింది. ప్రతాప మహారాజు చేతులకు సంకెలలు తగిలించగానే ఆయన తెల్లబోయి నిశ్చేష్టుడయాడు.

సంగతి అర్థమైన తరవాత ప్రతాపుడు, ఉదయనుడికి దాసోహం అని, తాను చేసిన తప్పులన్నీ ఒప్పుకున్నాడు. కాజేసిన

భస్మాలూ, అంజనాలూ ఒప్పగించి వేశాడు. అంతేకాక ఉదయనుడికీ, గడ్డపువాడికీ మొక్కి, "బాబూ, మీ బానిసను. నా సర్వస్వమూ మీదే. మన్నించండి," అని క్షమాపణ చెప్పుకున్నాడు.

ఎన్నోకష్టాల కోర్చి, గండాలు గడిచి, తమను రక్షించటానికి జీవితాన్నే అర్పించటానికి సిద్ధపడిన సాహసుడు ఉదయనుణ్ణి చూడగానే, రాజకుమార్తెలు ముగ్గురకూ ప్రాణం లేచివచ్చింది. చెప్ప లేని ఆవేశంతో ఉదయనుడి వద్దకు వచ్చారు. అప్రయత్నంగా జలజల మంటూ వారి కన్నుల వెంట ఆనంద బాష్పాలురాలినై.

అయితే, ఉదయనుడి చెయ్యి మొండిగా వుండటం వాళ్ళు వెంటనే కనిపెట్టి వేశారు. నిజానికి యీ సందడిలో అతడి చెయ్యి సంగతి అందరూ మరిచే పోయారు. కాని, సారథి అయిన గడ్డపు వాడు నించున్నపాటున పాతాళగృహానికి పోయి, అక్కడ పడివున్న ఉదయనుడి చేతిని స్వయంగా పట్టుకవచ్చాడు. అంజనాలు ప్రయోగించి చేతిని మామూలుగా అతికించివేశాడు.

రాక్షసుడు లోగడ రాకుమార్తెలను మూగవాళ్లనుగా చేసి వదిలాడు. అయితే, దేవి చేతిలోని గద్ద ఎప్పుడైతే భూపతన



మైనదో, అప్పుడే రాక్షసుడు కూడా మరణించాడు. రాక్షసుడితోనే పోయినై, అతడు ప్రయోగించిన మాయలన్నీ. ఆ మాయలలో ఒకటైన రాకుమార్తెల మూగతనమూ పోయింది. ఇప్పుడు వాళ్లు మామూలుగా చిలకల్లాగా మాట్లాడు తున్నారు.

ఈ విధంగా రాకుమార్తెలనే కాక; మాళవరాజ్య లక్ష్మిని కూడా సంపా యించుకు వచ్చిన ఉదయనుడు, అందరినీ వెంటబెట్టుని శ్రావస్తీనగరంలో అగుడు పెట్టాడు. గడ్డపువాడు భస్మాల, అంజనాల ప్రభావంతో నిశీధుని తలా, మొండెమూ అతికించి జీవంపోశాడు.

రాజ్యంలోని ప్రజయావన్మందీ, ఆనంద డోలికలలో తేలిపోయారు. రాజూ, రాణీ కవలసోదరుల ఋణం ఎన్ని జన్మాలకైనా తీర్చుకోలేమంటూ, వాళ్ళను ఎంతగానో అభినందించారు.

అప్పుడు కవలసోదరులు ముగ్గురినీ దానశీల మహారాజు చేరదీసుకుని, సుహాసిని చేతిని ఉదయనుడి చేతిలోనూ, సుభాషిణి చేతిని సంధ్య చేతిలోనూ, సుకేశిని చేతిని నిశీధుడి చేతిలోనూ వుంచాడు. గురుతుల్యుడైన గడ్డపువాడు దీవించగా, ముగ్గురు కవలలకూ, ముగ్గురు రాకుమార్తెలకూ అతివైభవంగా వివాహం జరిగింది.

తరువాత దానశీలమహారాజు, గడ్డపువాడిని మాళవదేశానికి అధిపతిగా వుండమనికోరాడు. కాని, సర్వసంగ పరిత్యాగి, నిమిత్త మాత్రుడు అయిన గడ్డపు వాడికి రాజ్యాలేలాలని లేదు. ప్రతాపసింహుడు పశ్చాత్తాపం తెల్పగా, అతని రాజ్యం అతనికి తిరుగా యిప్పించివేశాడు.

దానశీల మహారాజు తన రాజ్యాన్ని ముగ్గురు కవలసోదరులనూ పంచుకోమని కోరాడు. కాని, కవలలు ఎంత మాత్రమూ అందుకు ఆశపడలేదు. సర్వ సమర్థుడైన ఉదయనుడు, తను రాక్షసుడి భవనంలో చేజిక్కించుకున్న గుడ్లుమూడూ బయటికి తీశాడు. కొంత కొంత దూరాన విడివిడిగా గడ్డపువాడి సలహామీద, వాటిని మూడు చోట్లపెట్టి బద్దలు కొట్టేసరికి, అక్కడ వరసగా వెండికోటా, బంగారుకోటా, రత్నాల కోటా మూడూ ఏర్పడినై. ఆ కోటలలో కవలలు సుఖంగా ఉండసాగారు.

ఇంత హడావిడిలోనూ వారు ఒక్క విషయం మటుకు మరవలేదు. దుష్ట రాక్షసుడి బలికి ఆహుతిఅయి శిలలుగా మారిపోయిన, ఆ ప్రతిమల సంగతి ఉదయనుడిమనసును బాధిస్తూనేవున్నది. ఆ మహావీరులకు స్మారక చిహ్నంగా ఒక చక్కటి భవనం నిర్మించి, ఆ భవనం చుట్టూ, ఈ ప్రతిమలను స్తంభాలుగా అమర్చాడు. —(అయిపోయింది)






# తండ్రికి తగనివాడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నిన్ను భక్తితో కొలుచుకునే వారు ఎందరైనా ఉండవచ్చు. కాని రాజభక్తి అనేది ఎలా కలుగుతుందో, అది ఎందుకు పోతుందో చెప్పటం చాలా కష్టం. అందుకు నిదర్శనంగా నీకు స్వర్ణ సింహుడు అనే వాడి వృత్తాంతం చెబు తాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం జయపురనగరాన్ని నాగవర్మ అనే రాజు చాలా సమర్థతతో పాలించే వాడు. ఆయన పరిపాలనలో ప్రజలు చాలా సుఖపడ్డారు. అయితే నాగవర్మకు ఎంత కాలానికీ సంతానం కలగలేదు.

## బేతాళ కథలు



ఇది నాగవర్మకే కాక ప్రజలకు కూడా ఎంతో విచారం కలిగించింది. నాగవర్మ అనంతరం అలాంటి రాజే రావాలని ప్రజలు సహజంగా కోరారు. వారి కోరిక తీరకుండానే నాగవర్మకు వృద్ధాప్యం వచ్చేసింది.

రాజుతోబాటు రాజ్యాంగం కూడా క్షీణించసాగింది. ఎందుకంటే, రాజు చావు కోసం ఎదురుచూసే రాజద్రోహులు బయలుదేరి, కుతంత్రాలు ప్రారంభించారు. రాజు సంతానం కోసం జపాలూ, తపాలూ, హెూమాలూ మొదలైనవి విడవకుండా చేస్తూ, రాజ్యభారాన్ని మంత్రులకు వదిలేశాడు.

రాజద్రోహుల ముఠాకు అధిపతి రజితసింహుడు అనే సేనాపతి. ఏ క్షణాన రాజు చచ్చిపోయినా మరుక్షణమే సింహాసనాన్ని కాజెయ్యటానికి తగిన సన్నాహాలన్నీ రజితసింహుడు పూర్తిచేసుకుని సిద్ధంగా ఉన్నాడు. ఈ కుట్ర ఫలితంగా ప్రజల జీవితం అస్తవ్యస్తం కాకుండా కాపాడుకుంటూ వచ్చినవాడు ప్రధాన మంత్రి ధర్మదత్తుడు.

ధర్మదత్తుడు మహా మేధావి. నాగవర్మ పరిపాలన ప్రజారంజకంగా సాగటానికి ముఖ్య కారకుడు ధర్మదత్తుడు. సేనాపతి చేసే కుట్ర గురించి ఆయనకు పూర్తిగా తెలుసును. అయినా ఆయన ఆ కుట్రను భగ్నం చెయ్యటానికి ఎలాటి ప్రయత్నమూ చెయ్యలేదు. సింహాసనానికి సరి అయిన వారసుడు లేనప్పుడు, ఏ పరాయి రాజో రావటం కన్న సేనాపతి రాజు కావటమే నయం. కానీ, సేనాపతి సింహాసనం కోసం రాజును హతమార్చకుండా తగిన జాగ్రత్తలన్నీ ధర్మదత్తుడు తీసుకున్నాడు.

ఇంతలో అందరి అంచనాలూ తారుమారయే సంఘటన ఒకటి జరిగింది. నాగవర్మకు ఒక కొడుకు కలిగాడు. సింహాసనానికి వారసుడు ఏర్పడ్డాడు. ఒక రాజు చావు కోసం సేనాపతి ఎదురు చూస్తుంటే, మరొక రాజు పుట్టుకొచ్చాడు.

ఇందువల్ల సేనాపతికి పెద్ద దెబ్బ తగిలి నట్టయింది.

ప్రధానమంత్రి ధర్మదత్తుడికి కూడా చైతన్యం పుట్టుకొచ్చింది. ఆయన పూర్వం లాగా తటస్థంగా ఉండలేదు. అంత వరకూ ఆయన ముసలిరాజు ప్రాణాలనే కాపాడుతూ వచ్చాడు. ఇప్పుడు కొత్తగా పుట్టిన పసిగుడ్డు ప్రాణాలు కాపాడటమే గాక, అతన్ని సింహాసనం మీద కూర్చొ బెట్టే బాధ్యత కూడా ధర్మదత్తుడి పైన పడింది.

ఆయన రాజును ఏకాంతంగా కలుసుకుని, ఆయనతో మొట్టమొదటిసారిగా రజితసింహుడు చేస్తూ వస్తున్న ప్రయత్నాలను గురించి చెప్పాడు.

నాగవర్మ మండిపడి, "రజితసింహుడు ఇంత ద్రోహం తలపెడతాడా? వాణ్ణి ఇప్పుడే బంధించండి!" అన్నాడు.

"అది సాధ్యమయే పని కాదు, మహారాజా. రజితసింహుడి కుట్ర రాజ్యాంగం అణువణువునా పాకిపోయింది. ఇది ఈ నాటి కుట్ర కాదు. ఈ క్షణాన అతను తలచుకుంటే రాజు కాగలడు. అతన్ని అడ్డగలవారంతా అతని మనుషులే. ఇప్పుడు మనకున్న అసలు సమస్య రజితసింహుణ్ణి రాజు కాకుండా చెయ్యటం కాదు, పసిగుడ్డయిన యువరాజు ప్రాణాలు కాపాడటం; కాలక్రమాన సింహాసనం అతనికే దక్కేటట్టు చూడటం," అన్నాడు ధర్మదత్తుడు.





"అది ఎలా జరగాలి?" అని నాగవర్మ అడిగాడు.

ధర్మదత్తుడు తాను నిర్ణయించిన కార్యక్రమం రాజుకు చెప్పేశాడు. రాజు కూడా దానికి ఒప్పుకున్నాడు.

ధర్మదత్తుడి ఊహ తప్పుపోలేదు. రజితసింహుడు యువరాజును చంపించటానికి పథకం వేశాడు. అయితే అక్కడ కూడా అతనికి చుక్క ఎదురయింది. రజితసింహుడి పథకం అమలు జరిగే లోపల యువరాజు మాయమయాడు. ఈ సంగతి బయటపడగానే రాజభవనంలో గగ్గోలు బయలుదేరింది. అంతఃపురం శోకనాదాలతో నిండిపోయింది. రాణి మూర్ఛపోయింది. రాజు తన కొడుకును వెతకటానికి నాలుగు వైపులా మనుషులను పంపాడు.

రజితసింహుడు తన ప్రయత్నం పారనందుకు నిప్పులు కక్కుతూ రాజు వద్దకు వచ్చి, "విచారించకండి, మహారాజా! యువరాజును మాయం చేసిన రాజద్రోహిని హతమార్చుతాను," అన్నాడు.

రాజు అతనికేసి ఆశ్చర్యంగా చూసి, "ఎవరా ద్రోహి?" అని అడిగాడు.

"ఇంకా ఎవరు, మహారాజా? మీ ఉప్పు తింటూ మీకే ద్రోహం తలపెట్టాడు మీ ప్రధాన మంత్రి ధర్మదత్తుడు. ఆ ధర్మదత్తుడు కూడా కనిపించటం లేదు," అన్నాడు రజితసింహుడు.

ఈ మాటలకు నాగవర్మ ఏమీ సమాధానం చెప్పలేదు.

రజితసింహుడు ధర్మదత్తుడి కోసమూ, యువరాజు కోసమూ వేగులవాళ్ళ ద్వారా పరిసర రాజ్యాలన్నీ వెతికించాడు. కాని ఫలితం లేకపోయింది. ఇందుకోసం కాలం వ్యయం చెయ్యటం అతనికి వృథా అనిపించింది. అతను రాజును బంధించి, తానే రాజుగా అభిషేకం పొందాడు.

రజితసింహుడు రాజు కావటంతో పరిపాలన పూర్తిగా మారిపోయింది. రజితసింహుడికి అనుకూలంగా ఉండరని అను

మానం ఉన్న వారందరూ తొలగించ బడ్డారు. ముఖ్యంగా ధర్మదత్తుడి బంధు వర్గం వారికి నిలవనీడ లేకుండా పోయింది. ప్రజల జీవితం తారుమా రయింది. చాలామంది దేశం విడిచి పోయారు.

అయితే ధర్మదత్తుడి కొడుకు స్వర్ణ సింహుడు మాత్రం రజితసింహుడి అను గ్రహం సంపాదించ గలిగాడు. స్వర్ణ సింహుడు రజితసింహుణ్ణి అడుగడుగునా బలపరిచి, మొదటి నుంచీ అతని పట్ల అపారమైన భక్తి ప్రదర్శిస్తూ వచ్చాడు. అంతేగాక స్వర్ణసింహుడు శక్తిసామర్థ్యా లలో తన తండ్రికి తీసిపోడు. ఆ సంగతి రజితసింహుడు ఎరుగును. త్వరలోనే అతను స్వర్ణసింహుణ్ణి తన సేనాపతిగా నియమించాడు.

రజితసింహుడు తన పరిపాలనను సుస్థిరం చేసుకుని కూడా, ధర్మదత్తుడి ఆచూకీ తెలియనందుకు కలవరపడుతూ వచ్చాడు. ధర్మదత్తుణ్ణీ, యువరాజునూ చంపితేనేగాని సింహాసనం తన వంశానికి శాశ్వతంగా ఉండి పోదని అతనికి తోచింది.

ఒకనాడు రజితసింహుడు స్వర్ణ సింహుణ్ణి పిలిచి, "నా రాజ్యంలో నిన్ను మించిన రాజభక్తిగల వాడూ, పరాక్రమ




వంతుడూ లేడు. నా అనంతరం రాజ్యాధి కారం నా కూతురికీ, ఆమెను పెళ్ళాడే వాడికీ దక్కుతుంది. నువు ఒక పని చేసినట్టయితే ఆమెను నీకిచ్చి పెళ్ళి చేస్తాను. నువు ఎలాగైనా నీ తండ్రినీ, ఆయన వెంట ఉన్న యువరాజునూ బంధించి తీసుకురావాలి," అన్నాడు.

స్వర్ణసింహుడు నవ్వి, "మీ ఆజ్ఞ పాలించినందుకు నేను ప్రతిఫలం ఏమీ కోరను. మీరు కోరితే, నా తండ్రి నే కాదు, నా తల తీసి ఇయ్యమన్నా ఇస్తాను." అన్నాడు.

తరవాత స్వర్ణసింహుడు కొంత బలాన్ని వెంటతీసుకుని తన తండ్రి కోసం అరణ్య



ప్రాంతాలలో వెతకసాగాడు. అతని ప్రయత్నం త్వరలోనే ఫలించింది.

ధర్మదత్తుడు అరణ్యప్రాంతాల లోని కొండలమధ్య చేరి, ఒక వంక పసిగుడ్డుగా ఉన్న యువరాజును సాకుతూ, అటవికులతో సైనిక దళాలను సమకూర్చసాగాడు. కొందరు ఆటవికులు ఆయనకు శిష్యులై, ఆయన పంపగా జయపురానికి వచ్చి, జయపుర యువరాజు జీవించే ఉన్నట్టు తమకు యోగదృష్టి ద్వారా తెలిసిందని రహస్యంగా ప్రచారం చేశారు. క్రమంగా జయపురానికీ, ధర్మదత్తుడు ఉన్న ప్రాంతానికీ ఒక రహస్య రహదారి ఏర్పడింది. అనేకవేల మంది దేశం విడిచిపోతున్నామని చెప్పి, అరణ్యంలో వున్న ధర్మదత్తుణ్ణి చేరుకున్నారు.

స్వర్ణసింహుడు తన తండ్రి జాడ పసిగట్టి ఆయన వద్దకు చేరేసరికి ధర్మదత్తుడి కింద పెద్దసేన ఏర్పడి ఉన్నది. స్వర్ణసింహుడు నిర్ఘాంతపోయాడు.

ధర్మదత్తుడు తన కొడుకును చూసి, "నగరంలో అందరూ క్షేమంగా ఉన్నారా? రజితసింహుడి పరిపాలన ఎలా ఉన్నది?" అని అడిగాడు.

"నేను వచ్చినది క్షేమసమాచారాలు మాట్లాడటానికి కాదు," అన్నాడు స్వర్ణసింహుడు.

"నాకు తెలుసు. నన్నూ, యువరాజునూ బంధించి పట్టుకు పోవటానికి వచ్చావు. కాని ముందు నువ్వూ, నీ సైనికులూ ఇక్కడి నుంచి ప్రాణాలతో తిరిగి పోవటం కూడా సాధ్యం కాదు," అన్నాడు ధర్మదత్తుడు.

స్వర్ణసింహుడు తన సైనికులను ఉద్దేశించి, "ఆయనను బంధించండి!" అని ఒక్క కేక పెట్టాడు. మరుక్షణం అతని సైనికులు ఆటవికులకు చిక్కారు. ఒక ఆటవికుడు ఒక్క దెబ్బతో స్వర్ణసింహుణ్ణి మూర్ఛపోగొట్టాడు.

ధర్మదత్తుడు తన కొడుకు ముఖాన నీళ్ళు చల్లి అతనికి తెలివి తెప్పించాడు.

తరవాత స్వర్ణసింహుడు సిగ్గుపడుతూ తండ్రికి క్షమాపణ చెప్పుకుని, "రజిత సింహుడు నాకు అందచేసిన భోగాలతో మదించి, మిమ్మల్ని పట్టుకోవటానికి వచ్చాను. జరిగిన దానికి పశ్చాత్తాప పడుతున్నాను. నన్ను మీ దగ్గిరే ఉండ నియ్యండి," అన్నాడు.

ధర్మదత్తుడు అందుకు ఒప్పుకోక, "నీ సహాయం మాకు అక్కర్లేదు. నిన్ను నమ్ముకున్నవారికి రాబోయే కష్టాలను ఎదుర్కో. వెళ్ళు. త్వరలోనే యుద్ధం జరుగుతుందనీ, రజితసింహుణ్ణి కుక్కను చంపినట్టు చంపుతామనీ చెప్పు," అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, స్వర్ణసింహుడి రాజభక్తి అంతా ఒక్క దెబ్బతో ఎలా మాయమయింది? అతను నిజంగా మారాడా, లేక దొంగ ఎత్తు వేశాడా? అతను ఉంటానన్నప్పటికీ ధర్మదత్తుడు ఎందుకు ఉండనియ్య లేదు? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "స్వర్ణ సింహుడిలో రాజభక్తి ఉన్నదనటానికి ఆధారం లేదు. తన బంధువర్గం అష్ట కష్టాలలో ఉన్నసమయంలో అతను ఆత్మ రక్షణ కోసం రాజుకు నమ్మిన బంటు అయాడు. నిజమైన రాజభక్తి గలవాడు ధర్మదత్తుడి లాగా అష్టకష్టాలూ పడతాడు గాని స్వార్థం చూసుకోడు. ఉత్త చేతులతో తిరిగి పోతే రజితసింహుడు తనను చిత్ర హింస చేస్తాడనే ఉద్దేశంతో అతను తండ్రి వెంట ఉండటానికి సిద్ధపడ్డాడు. రజిత సింహుణ్ణి పడగొట్టటానికి తనకొడుకులాటి వాడి సహాయం పొందటంకన్న హీనం మరొకటి, ఉండదన్న అభిప్రాయంతో ధర్మదత్తుడు అతన్ని తన వెంట ఉండ నియ్యలేదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# రాజుగారి రహస్యం

ఒక రాజుగారిది పేడిమూతి. ఆయన ఎప్పుడూ అందమైన పెట్టుడు మీసాలు పెట్టుకుని ప్రజలకు కనిపించేవాడు. ఈ రహస్యం రాజుగారి మంగలికి తప్ప మరెవరికీ తెలియదు.

ఇంతలో రాజుగారి మంగలి చనిపోయాడు. వాడి స్థానంలో రాజు మరొక మంగలిని నియమిస్తూ, వాడికి తన రహస్యం చెప్పి, దాన్ని బయటపెట్టితే తల తీసేస్తానన్నాడు. మంగలి ఇంటికి వచ్చి, దూరాన ఆడుకుంటున్న తన కొడుక్కు వినిపించకుండా తన భార్యకు రాజుగారి రహస్యం చెప్పి, "ఇది ఎవరికన్నా తెలిసిందంటే నా పీక తెగుతుంది," అన్నాడు.

తరవాత ఒక రోజు పరదేశి అయిన చిత్రకారుడు ఒకడు వచ్చి, రాజుగారి చిత్తరువు వేసి చూపాడు. చిత్తరువులో రాజుగారికి మీసాలులేవు. అదిచూసి రాజు నిర్ఘాంతపోయి, చిత్రకారుడికి రెట్టింపు బహుమానం ఇస్తూ, "ఇవాళే దేశం విడిచిపో! ఈ రహస్యం ఎక్కడా చెప్పకు," అన్నాడు. పరధ్యానంలో చిత్రకారుడు తల ఊపి వెళ్ళిపోయాడు.

తరవాత రాజభటులు వచ్చి మంగలిని పట్టుకుని, "రాజుగారి రహస్యం బయట పెట్టినందుకు నిన్ను ఉరితీస్తారు. చెరసాలకు నడు!" అన్నారు. తన భార్య రహస్యం బయట పెట్టి ఉంటుందనుకుని, మంగలి భార్యను చితకతన్ని, భటులతో వెళ్ళిపోయాడు. ఏ పాపమూ ఎరగని మంగలి భార్య తప్పు తన కొడుకుదై ఉంటుందనుకుని వాణ్ణి పట్టుకుని చితకతన్నింది.

ఇంతలో చిత్రకారుడు తిరిగి వచ్చాడు. "ఏమయ్యా, దేశం విడిచి పొమ్మంటినే! మళ్ళీ వచ్చావేం? ఏమిటి నీ యెత్తు?" అని రాజు అడిగాడు.

"నా మతిమరుపు మండ! తమ చిత్తరువుకు మీసాలు పెట్టటం మరిచాను. ఒక్కసారి దాన్ని ఇలా ఇప్పించండి!" అన్నాడు చిత్రకారుడు.

—ఎ. మనోహరరెడ్డి






# గట్టెక్కిన కష్టం

వత్సలతల్లి ఆమె పదో ఏట పోయింది. తండ్రి మరో పెళ్ళి చేసుకున్నాడు. సవతి తల్లి వత్సలను రాచి రంపానపెట్టేది. వత్సల ఇంటి చాకిరీ అంతా చెయ్యటమే గాక, అడవికి పోయి కట్టెపుల్లలు కూడా ఏరుకు రావలిసి వచ్చేది. ఆమె అడవికి వెళ్ళేదారిలో ఒక చోట పాము పుట్ట ఉండేది. ఆ పుట్టలో చెయ్యిపెట్టి, పాము కాటుతిని చచ్చిపోదామని ఆమెకు చాలా సార్లు అనిపించింది. కాని ఆమె అలా చెయ్యక పోవటానికి కారణం ఆమె తమ్ముడు. వాడంటే వత్సలకు ప్రాణం. వాడి మీద ఆమె ఈగను కూడా వాల నియ్యక, వాడి వాటా దెబ్బలు కూడా తానే తినేది. తాను చచ్చిన మరుక్షణం తన తమ్ముణ్ణి సవతితల్లి ఏ భూస్వామి దగ్గిరో పాలేరుపనికి కుదుర్చుతుందని వత్సలకు తెలుసు.

అనుకోకుండా వత్సల తండ్రి చని పోయాడు. ఇక తమ జీవితం కుక్కల కన్న హీనమై పోతుందని వత్సల గ్రహిం చింది. ఆమె అనుకున్నట్టే, సవతితల్లి వత్సల తమ్ముణ్ణి పెద్దరెడ్డి ఇంట పని వాడుగా కుదిర్చింది.

వత్సల ఈ ఏర్పాటుకు ఒప్పుకోక, "వాడికి పదేళ్ళన్నాలేవు. పని ఏం చేస్తాడు? వాణ్ణి చదువుకోనియ్య," అన్నది సవతితల్లితో.

"పదేళ్ళు లేకపోతే నేం? పాతికేళ్ళ మనిషి తిండి తింటాడు. అంతా తింటూ కూర్చుంటే, ఆర్జించి పొయ్యటానికి మీ అయ్య లేడు," అన్నది సవతి తల్లి.

"నా తమ్ముణ్ణి నేను పోషించు కుంటాలే. అడవిలో ఇంకో రెండు పుల్లలు హెచ్చుగా ఏరుకొచ్చి అమ్మితే ఒక అర్ధ రూపాయి దొరక్కపోదు," అన్నది వత్సల.

ఎం. కామేశ్వరరావు




సవతితల్లి ఇందుకు అభ్యంతరం చెప్ప లేక, "ఇంటిపని ఎగగొడితే ఊరుకునేది లేదు," అని వత్సలను హెచ్చరించింది.

వత్సల ఇంటి పని చేస్తూ, అడవి నుంచి మోయలేనన్ని కట్టెలు తెచ్చి, ఊళ్ళో అమ్ముతూ వచ్చింది.

ఇలా కొన్నాళ్ళు గడిచింది.

సవతితల్లి తన నగల కోసం లోగడ పెద్ద మొత్తం అప్పుచేసింది. వత్సలతో బాటు ఆ అప్పు కూడా వదిలిపోయే అవకాశం ఆమెకు లభించింది. ఆమె ఒకనాడు వత్సలతో, "వారంలో నీ పెళ్లి! నీ అయ్య తాగుడుకు ఊరినిండా అప్పులు చేసి పోయాడు. నిన్నిచ్చి పెళ్ళి చేస్తే వరహాలయ్య రెండువేలు ఇస్తానన్నాడు. ఆ డబ్బుతో అప్పులు తీర్చి హాయిగా ఊపిరి పీల్చుకుంటాను," అన్నది.

ఆ మాట వినేసరికి వత్సలకు మూర్ఛ వచ్చినట్టయింది. "ఆ వరహాలయ్య రోగిష్ఠి వాడు." ఆ రోగిష్ఠివాడితోనా నా పెళ్ళి?" అని వత్సల ఆశ్చర్యంగా అడిగింది.

"నువు అందాల రాశివా? వాడు రోగిష్ఠి కాడు. వాడి ఒంటితీరే అంత. నువు వెర్రివేషాలు వెయ్యక, పెళ్ళికి ఒప్పుకో. లేకపోతే మీ అయ్య అప్పు తీరదు," అన్నది సవతితల్లి.

ఈ సారి వత్సల ఈ పెళ్ళి నుంచి తప్పించుకునేటందుకు ఆత్మహత్య చేసుకుందామని నిశ్చయించుకున్నది. తమ్ముడి భవిష్యత్తు ఏమైనా కానీ! ఆమె అర్ధరాత్రివేళ అడవికి వెళ్ళి, పాము పుట్టలో చెయ్యిపెట్టి కాటు వేయించుకునేందు దాని దగ్గిర చతికిలబడింది.

పుట్ట సమీపంలో చెట్టు మీద కొత్తగా వచ్చి చేరిన భూతం ఒకటి, వత్సలను చూడగానే, ఆమెను భయపెట్టటానికి పెడబొబ్బలు పెట్టుతూ, చెట్టు మీద నుంచి కిందికి దూకింది.

చావటానికి సిద్ధపడి వచ్చిన వత్సల ఆ నిలువెత్తు భూతాన్ని చూసి దడుచుకోలేదు. అది చూసి భూతం నివ్వెరపోతూ,

"నన్ను చూస్తే నీకు వణుకుపుట్టటం లేదా? నే నెవరో తెలుసా? భూతాన్ని! మింగేస్తాను!" అంటూ నోరు తెరిచి, వాడిగా ఉన్న తన చేతిగోళ్ళు చూపింది.

"మా పిన్ని నీ కన్న కూడా భయం కరమైనది," అన్నది వత్సల.

భూతం ఈ మాట నమ్మలేక పోయింది.

"అయితే మా పిన్ని నీ లాగా వికారంగా ఉండదు. కాని నీ కన్న చాలా క్రూర మైనది. నువు ఒక్కసారే మింగేస్తావు. మా పిన్ని బతికున్నన్నాళ్ళూ కొంచెం, కొంచెం మింగుతుంది. ఆ నరకం అనుభ విస్తేగాని తెలీదు," అన్నది వత్సల.

"మీ పిన్నిని చూసి తీరాలిసిందే!" అన్నది భూతం.

"చూస్తే ఏం తెలుస్తుంది? మా పిన్నికి అణిగి మణిగి ఒక్క రోజుంటే అప్పుడు తెలుస్తుంది. నువు ఇదేరూపంలో వెళితే నిన్ను మర్యాద కూడా చేస్తుంది. నువు డబ్బిస్తానంటే నన్నిచ్చి పెళ్ళి కూడా చేస్తుంది," అన్నది వత్సల.

భూతం ఒకక్షణం ఆలోచించి, "ఒక పని చేద్దాం. నేను నీలాగా మారతాను. మీ పిన్ని నన్ను చూసి నువే అనుకుం టుంది. ఓ రోజంతా మీ పిన్ని చెప్పుచేతల్లో ఉండి చూస్తాను. నేను తిరిగి వచ్చేదాకా ఇక్కడే ఉండు," అన్నది.



వత్సలకు ఇదంతా వ్యర్థప్రయాసగా తోచింది. కాని భూతం తెగముచ్చట పడుతూండటం చేత ఆమె సరే నన్నది.

"రేపు అర్ధరాత్రి దాకా ఇక్కడే ఉంటాను. నువు మాత్రం తప్పకుండా రావాలి," అన్నది ఆమె భూతంతో.

భూతం అచ్చు వత్సల లాగా తయారై వెళ్లిపోయింది. వత్సల రోజంతా అడవిలో స్వేచ్ఛగా తిరిగి, సాయంకాలానికి భూతం ఉండే చెట్టు దగ్గిరికి వచ్చేసింది. చీకటి పడబోతుండగా వత్సల రూపంలో ఉన్న భూతం ఏడుస్తూ తిరిగి వచ్చింది.

"అప్పుడే వచ్చేశావేం?" అని వత్సల ఆశ్చర్యంగా అడిగింది.

"ఇంక ఒక్క క్షణం కూడా ఆ భూతక్కి చేతి కింద పని చెయ్యలేను. పగలంతా ప్రాణం తినేసింది. వీపు మీద చింత బరికెలతో కొడుతూ ఇంటి పని అంతా చేయించింది. ధాన్యం దంపించింది. పెరడు తవ్వించింది. కడుపు నిండా భోజనం పెట్టలేదు. రాత్రంతా నూకలు విసరాలట. నా వల్ల కాదు. ఒప్పుకుంటాను, భూతాల్లో కూడా మీ పిన్ని లాంటివి ఉండవు. ఎలాగో ఆమె కళ్ళు కప్పి ఇలా వచ్చాను," అన్నది భూతం.

భూతం మాటలు ఇంకా పూర్తికాక పూర్వమే వత్సల సవతితల్లి చింతబరికె చేతపట్టుకుని వచ్చి, "నాకు తెలుసు, పని ఎగగొట్టి ఇక్కడ వచ్చి కూచుంటావని! దొంగముండవు! ఇంటికి పద!" అన్నది.

ఆమెను చూడగానే వత్సల చప్పున చెట్టు చాటుకుపోయింది. భూతం అదిరిపడి, తన అసలురూపం ధరించి, చెట్టు మీదికి ఎగిరిపోయింది.

అది చూసి వత్సల సవతితల్లి కెవ్వున అరిచింది. ఇరవై నాలుగుగంటలూ తన అదుపులో ఉండే వత్సల భూతంగా మారటం కళ్ళారా చూడగానే ఆమె మతి పోయింది. వెర్రి చూపులు చూస్తూ, పిచ్చిగా అరుస్తూ ఆమె అడవిలోకి పరిగెత్తిపోయింది.

భూతం ఒక బరువైన డబ్బు మూటను వత్సల కాళ్ళముందు పారేసి, "నీకూ, నీ పిన్నికీ ఒక దండం! ఎరక్కపోయి ఈ ప్రాంతానికి వచ్చాను," అని, గబ్బిలంగా మారి అరుస్తూ ఎగిరిపోయింది.

వత్సల ఆ మూట తీసుకుని ఇంటికి వెళ్ళిపోయింది. అడవిలోకి పారిపోయిన సవతితల్లి మళ్ళీ తిరిగి రాలేదు. వత్సల ఆమెకోసం వెతికించింది, కాని ఆమెజాడ దొరకలేదు.

వత్సల కాలక్రమాన తనకు నచ్చిన వాణ్ణి పెళ్ళాడి, తన తమ్ముణ్ణి తన వద్దనే ఉంచుకున్నది. భూతం ధర్మమా అంటూ ఆమె కష్టం గట్టెక్కింది.





# పరీక్ష

పూర్వం విజయనగరంలో, శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలో ఒక రత్న నిపుణుడు ఉండేవాడు. దేశదేశాల నుంచి అనేక మంది వర్తకులు రాయల దగ్గరికి రత్నాలను అమ్మకానికి తెచ్చేవారు. ఆ రత్నాలను పరీక్షించి, వాటి ధర నిర్ణయించటం రత్ననిపుణుడి పని.

ఈ రత్ననిపుణుడికి వసంతుడు అని ఒక కుమారుడు ఉండేవాడు. వంశపారంపర్యంగా వస్తున్న రత్ననైపుణ్యం వసంతుడికి కూడా అబ్బింది. అతను ఆ విద్యలో తండ్రికి ఉన్నంత ప్రావీణ్యమూ సంపాదించాడు. అయితే అతను సంపన్నులైన మిత్రులితో చేరి అస్తమానమూ వినోదాలలో కాలక్షేపం చేసేవాడు.

ఒక రోజు ఇద్దరు ధనికులు వసంతుడి దగ్గిరికి వచ్చి, "మా వద్ద కొన్ని విలువైన రత్నాలు ఉన్నాయి. వాటిని పరిశీలించి, వాటికి సరి అయిన విలువ నిర్ణయించి పెట్టితే మీకు వెయ్యివరహాలు ఇచ్చుకుంటాం," అన్నారు.

వసంతుడు అందుకు సమ్మతించి, మర్నాడు రత్నాలను తీసుకు రమ్మని చెప్పాడు.

ఆ రాత్రి ఆ ధనవంతులలో ఒకడు రహస్యంగా వసంతుడి వద్దకు వచ్చి, "రేపు మే మిద్దరమూ రత్నాలతో వస్తాము. వాటిలో రెండు విలువైన ఎర్రటి మణులుంటాయి. వాటి విలువ పదివరహాలు మించి ఉండదని మీరు అబద్ధం ఆడాలి," అన్నాడు.

"నేను ఎన్నటికీ అలా అబద్ధాలాడి పాపం మూటకట్టుకోను," అన్నాడు వసంతుడు.

"నేను రత్నాలు కొనబోతున్నాను. ఆ రెంటినీ చౌకగా కొంటేనే గాని నాకు

ఎం. వి. కె. మూర్తి

లాభంరాదు. మీరు నాకు సహాయపడి నట్టయితే మీకు పదివేలవరహాలు ఇచ్చు కుంటాను.'' అని ఆ ధనికుడు వసంతుణ్ణి బతిమాలాడు.

పదివేలవరహాలు అనగానే వసంతుడికి ఎక్కడలేని ఆశ పుట్టుకొచ్చింది. అతను మెత్తబడ్డాడు.

మర్నాడు రెండో ధనికుడు రత్నాలు తెచ్చాడు. వాటిలో రెండు ఎర్రనివి ఉన్నాయి. అని చాలా విలువగలవని వసంతుడు గ్రహించి కూడా, వాటి విలువ పదివరహాలు మించదనీ, అవి నిజమైన రత్నాలు కావనీ అబద్ధం చెప్పాడు.

ఇద్దరు ధనికులూ వెళ్ళిపోయారు. తర వాత వసంతుడికి పదివేలవరహాలు అందాయి. వాటిని అతను విందులకూ, విలాసాలనూ ఖర్చుపెట్టాడు.

కొంత కాలానికి వసంతుడి తండ్రి కన్నుమూశాడు.

వంశ పారంపర్యంగా వస్తున్న తన తండ్రి ఉద్యోగం తనకే ఇయ్యమని అర్థించటానికి వసంతుడు రాయల దగ్గిరికి వెళ్ళాడు.

రాయల చెంతనే ఉన్న మహామంత్రి తిమ్మరుసు వసంతుడి అభ్యర్థన విని నవ్వుతూ ఇలా అన్నాడు :

"నీ తండ్రి జబ్బు పడగానే, నువు ఆ పదవికి అర్హుడివో, కావో పరీక్షించ టానికి మేం ధనవంతుల వేషాలలో నీ దగ్గిరికి వచ్చాం. తన బాధ్యత మరిచి, నీలా వర్తకులతో లాలూచీ పడి, లంచాలు పట్టే వ్యక్తి ఈ ఉద్యోగానికి అర్హుడు కాడని ఆనాడే నిర్ణయించాం. నీ తండ్రి స్థానంలో సన్మార్గుడైన రత్న నిపుణుణ్ణి నిర్ణయించటం ఎప్పుడో జరిగింది. విశ్వాస పాత్రుడైన నీ తండ్రిని చూసి, నిన్ను శిక్షించకుండా వదిలిపెట్టటం జరిగింది. ఇక వెళ్ళు!"

ఒక్క నీతిమాలిన పని చేసి, అనాదిగా వస్తున్న ఉద్యోగాన్ని తన వంశం నుంచి శాశ్వతంగా పోగొట్టుకుని, వసంతుడు వెళ్ళిపోయాడు.



# 168. వింత కొండ

ఈ విడ్డూరమైన శిలాకృతి పెరూదేశం లోని అండీపర్వతాల మధ్య ఉన్నది. దీనికి సమీపంలో రాగి గనులున్నాయి. ఈ ప్రాంతంలో గవ్వలు విశేషంగా దొరకటాన్ని బట్టి ఒకప్పుడు ఇక్కడ సముద్రం ఉండేదని తెలుస్తుంది. అంతేగాక ఈ ప్రాంతంలో ఉప్పుకొండ కూడా ఉన్నది.





# రాజయుక్తి

రాఘవ మహారాజుకు చేపలు పట్టట మంటే అమిత సరదా. ఆయనకు వేట మీద మోజు లేదు. తన సరదా తీర గలందులకు ఆయన తన రాజ్యమంతటా చెరువులు తవ్వించి, ప్రజలకు నీటి సదుపాయం కూడా చేశాడు. ఆ చెరువులలో చేపలు పెంచి, ఆ చేపల మీద వచ్చిన ఆదాయాన్ని ధర్మకార్యాలకు వినియోగించేవారు. ఆ చెరువులలో స్నానాలూ, బట్టలు ఉతకటమూ చేయరాదని రాజు గట్టిగా శాసించాడు.

రాజుకు ఇద్దరు కొడుకులు. ఒకడికి పది ఏళ్లు, రెండోవాడికి తొమ్మిది ఏళ్లు. ఒకసారి రాఘవుడు తన పెద్దకొడుకును వెంటబెట్టుకుని, రాజధానికి ఇరవైమైళ్ల దూరంలో ఉన్న చెరువులో చేపలు పట్టటానికి వెళ్లాడు. ఇద్దరూ గాలాలు వేసి కూర్చున్నారు.

సాయంకాలందాకా ఒక్క చేపకూడా పడలేదు. వాళ్లకు చాలా విసుగుపుట్టింది. ఇంతలో రాజకుమారుడి గాలానికి చేప తగులుకున్నది. అది చాలా పెద్ద చేప అయి ఉండాలి. దాన్ని పైకి లాగటం ఆ కుర్రవాడికి కష్టమయింది. అందుచేత రాజు తన కొడుకు గాలాన్ని పుచ్చుకుని చేపను లాగసాగాడు. అది నీటి మీదికి వచ్చేటప్పుడు, నీటిలో దాని పొలుసులు తళతళా మెరిశాయి. అది ఆకారంలోనూ, ప్రమాణంలోనూ అసాధారణంగా ఉన్నది. అది నీటి పైకి రాగానే పట్టుకుందామని రాజకుమారుడు ఒక బుట్టవల తీసుకుని సిద్ధంగా ఉన్నాడు.

అనుకున్నట్టే చేప వలలో పడింది. కాని దాని బరువుకు రాజకుమారుడు తూలి నీటిలో పడ్డాడు. వలతో సహా చేప ఒడ్డున పడింది. రాజుగారి మనుషులు

ఏ. సి. సర్కార్, ఐంద్రజాలికుడు

రాజకుమారుణ్ణి నీటి నుంచి పైకి తీశారు. రాజూ, రాజకుమారుడూ ఆ వింత చేపను చూద్దామని దాని దగ్గిరికి వచ్చారు. అప్పటికి చేప మరింత పెద్దది అయింది. రాజకుమారుడు దాన్ని పట్టుకోబోయాడు. అతను దాన్ని పట్టుకున్నాడో లేదో, ఆ సంధ్య కాంతిలో అది విచిత్రంగా మారి, రెక్కలు పెంచుకుని, ఆకాశంలోకి ఎగిరి పోయింది. కుర్రవాడు అమితంగా భయపడి, వణికిపోసాగాడు.

రాజభవనానికి తిరిగి వచ్చినాక, ఆ రాత్రి రాజకుమారుడికి తీవ్రంగా జబ్బు చేసింది. ఇంకో వారం రోజులకు రాజు తన ఉపరాజధాని అయిన రామ్‌గడ్ వెళ్లవలసి ఉన్నది. ఆయనకూ, ఆయన కుటుంబానికీ అక్కడి ప్రజలు ఘనమైన స్వాగతం ఏర్పాటు చేస్తున్నారు. ఎందుకంటే, రాజుగారు అయిదు సంవత్సరాల అనంతరం వేంచేస్తున్నారు.

కాని ఆకస్మికంగా కొడుకుకు జ్వరం తగలటం రాజుకు బాధ కలిగించింది. ఆయన ఆస్థానవైద్యుణ్ణి, వ్యాధి కారణం ఏమై ఉంటుందని అడిగాడు.

"మనసుకు కలిగిన అఘాతం తప్ప మరేమీ కాదు. కుర్రవాడు చక్కగా నిద్రపోవటానికి మందు ఇచ్చాను," అన్నాడు వైద్యుడు.



అయిదో రోజు కల్లా జ్వరం తగ్గి కుర్రవాడు తేరుకున్నాడు, కాని చాలా బలహీనంగా ఉన్నాడు.

"నాన్నా, నేనిప్పుడు బాగానే ఉన్నాను. నేను కూడా రామ్‌గడ్ వస్తాను," అన్నాడు వాడు రాజుతో.

ఆస్థానవైద్యుడు అందుకు ఒప్పుకోక, "బాబూ, నువ్వింకా పూర్తిగా కోలుకోలేదు. పదిహేను రోజులదాకా నువు ఎక్కడికీ కదలరాదు. నీ నరాలు చాలా దెబ్బతిన్నాయి. ఏ విధమైన ఉద్రేకం కలిగినా నీ వ్యాధి తిరగబెట్టి, ప్రమాదకరంగా పరిణమించ వచ్చు. అందువల్ల జాగ్రత్తగా వుండాలి," అన్నాడు.




రాణి కూడా కొడుకుతో ఆ మాటే అన్నది. కాని కుర్రవాడు మంకుపట్టు పట్టి, ఎవరూ తనకు అనుకూలంగా చెప్పక పోయేసరికి, భోజనం మానేశాడు.

"కుర్రవాణ్ణి రామ్‌గడ్ తీసుకుపోవటం నిజంగా మంచిది కాదంటావా?" అని రాజు ఆస్థాన వైద్యుణ్ణి ఏకాంతంగా అడిగాడు.

ఆ ప్రశ్నకు సమాధానంగా వైద్యుడు తన పూర్వానుభవం ఒకటి ఈ విధంగా చెప్పాడు:

ఆయన కాశీనగరంలో వైద్య విద్య పూర్తిచేసిన సమయంలో ఇదేమాదిరి సందర్భం ఒకటి తటస్థపడింది. కాశీలో ఒక పంచదార వర్తకుడికి ఒక కొడుకు ఉండేవాడు. వాడి బుద్ధి మహా క్రూరమైనది. చక్కెర బస్తాలుండే కొట్టులోకి చీమలు వచ్చేవి. ఆ కుర్రవాడు వాటిని చంపి ఆనందించేవాడు. అలా చెయ్యటం చాలా తప్పు అని తండ్రి ఎంతగా చెప్పినా వాడు వినిపించుకోలేదు. ఒకనాడు వాడు తన స్నేహితులతో ఎటో వెళ్ళి వినోద కాలక్షేపం చేస్తానంటే వాడి తల్లి డబ్బు ఇచ్చింది కాదు. వాడు తల్లి మీద అలిగి, ఇంటికి సమీపంగా ఉన్న వనంలో ఒక చెట్టు కింద కూర్చున్నాడు.

"ఎందుకు విచారిస్తావు? నా వెంటరా, నీకు కోరినంత బంగారం ఇస్తాను," అని ఎవరో అనటం వాడికి వినిపించింది. కాని ఎవరూ కనిపించలేదు.

"ఎవరా మాట్లాడేది?" అని వాడు అడిగాడు.

"నేను చీమల రాజును. నీ కాలి బొటనవేలు దగ్గిర చూడు," అని జవాబు వచ్చింది.

వాడు తన ఎడమ కాలి బొటనవేలు దగ్గిర ఉన్న చీమను చూసి, దాన్ని పట్టుకోబోతే, అది పెరిగి పెద్దదవుతూ చూస్తూండగానే ఏనుగంత అయింది.

కుర్రవాడు దిగ్భ్రమతోనూ, భయంతోనూ పరిగెత్తి ఇంటికి వెళ్ళాడు. వాడు

వాడి తల్లి దగ్గిరికి పోయేసరికే జ్వరం కాలిపోతున్నది. రెండు రోజులు అది తగ్గక పోయేసరికి, ఆస్థాన వైద్యుడి గురువుగారికి పిలుపు వచ్చింది. ఆయన తన శిష్యుణ్ణి పంపాడు. అతను గురువు గారిని సంప్రదించుతూ రోగికి చికిత్సచేసి జ్వరం నయం చేశాడు. కాని రోగి చాలా నీరసించి ఉన్నాడు. ఆ స్థితిలో ఆ కుర్ర వాడు వైద్యుడి సలహా పాటించక ఏదో కుస్తీ చూడబోయాడు. అది చూస్తూండగా రోగికి ఉద్రేకం వచ్చి వ్యాధి తిరగ బెట్టింది. మత్తుగా వాడు ఇల్లు చేరి నిద్ర పోయాడు. మర్నాడు వాడికి తీవ్రమైన ఉన్మాదస్థితి ఏర్పడింది. దానికి ఇక చికిత్స లేదు.

ఆస్థానవైద్యుడు రాజుకు ఈ సంఘటన గురించి చెప్పి, ''రాజకుమారుణ్ణి ఈస్థితిలో రామ్‌గడ్ తీసుకుపోవటం ప్రమాదకరం. అందుకు పూచీ మీదే అవుతుంది,'' అన్నాడు.

కాని రాజుకు ఏం చెయ్యాలో తెలియ లేదు. కుర్రవాడు చెప్పినా వినడు. ఆస్థాన ఐంద్రజాలికుడితో సంప్రతించ మని వైద్యుడు రాజుకు సలహా ఇచ్చాడు. రాజకుమారుడికి జ్యోతిషంలోనూ, అలౌకిక శక్తులలోనూ నమ్మకం ఉన్నది. వాటి ఆధారంతో ఇంద్రజాలం ఎంతయినా నడపవచ్చు.

ఆస్థాన ఐంద్రజాలికుడు ఏకాంతంగా రాజును కలుసుకుని, సంగతి అంతా






తెలుసుకుని, "విచారించకండి, మహారాజా. మన ఆస్థాన జ్యోతిష్కుడి సహాయంతో చిన్న ఇంద్రజాలం చేసి, అబ్బాయిగారి మనసు మారేలాగా చేస్తాను," అన్నాడు.

రామ్‌గడ్‌కు ఎవరెవరు వెళ్ళుతున్నారని ఐంద్రజాలికుడు అడిగితే, తానూ, తన చిన్నకొడుకూ వెళుతున్నామనీ, రాణి పెద్దవాణ్ణి కనిపెట్టుకుని ఇంటి వద్దనే ఉంటుందనీ రాజు చెప్పాడు.

ఆ రోజు అపరాహ్ణం ఆస్థానజ్యోతిష్కుడు రాజకుమారుడి వద్దకు వచ్చి, ఎలా ఉన్నావని అడిగాడు. తనకు ఒంట్లో బాగానే ఉన్నదిగాని, అమిత నీరసంగా ఉన్నదని రాజకుమారుడు చెప్పేసరికి జ్యోతిష్కుడు చిరునవ్వు నవ్వాడు. ఎందుకు నవ్వుతున్నావని రాజకుమారుడు అడిగాడు.

"ఇది మామూలు నీరసం కాదు, బాబూ. నీకు పూర్తిగా చికిత్స జరగలేదు. అంతర్గతంగా వ్యాధి ఇంకా ఉన్నది," అన్నాడు జ్యోతిష్కుడు.

"అదేమిటి? నేను నాన్నగారి వెంట రామ్‌గడ్ ఉత్సవానికి పోతున్నాను!" అన్నాడు రాజకుమారుడు. వైద్యుడు అందుకు అభ్యంతరం చెబుతున్నాడనీ, తనను రామ్‌గడ్ తీసుకుపోయేదాకా ఆహారం ముట్టననీ కూడా రాజకుమారుడు చెప్పాడు.

"నువు వెళ్ళాలనుకుంటే అలాగే వెళ్ళవచ్చు. కాని అందుకు గ్రహాలు అనుకూలంగా ఉన్నాయో, లేదో చూద్దాం. అక్కడ నీకు ఏదైనా ఆపద కలిగితే దాన్ని గ్రహాలు ఎదుర్కోగలవో లేదో తెలుసుకోవాలి గద! అందరి ముందూ ఒక ప్రయోగం చేసి, దాన్ని చూడటానికి రాజుగారినీ, రాణిగారినీ, మంత్రిగారినీ, అందరినీ రమ్మందాం, సరేనా! కాని, ఒక్క షరతు: నువు నా నిర్ణయానికి కట్టుబడాలి. లేని పక్షంలో నాకెందుకు వృధా శ్రమ?" అన్నాడు జ్యోతిష్కుడు.

"ప్రయోగం చెయ్యండి. నేను మీ మాటకు కట్టుబడతాను," అన్నాడు రాజకుమారుడు.

ఆ సాయంకాలం రాజభవనంలోని హాలులో రాజూ, రాణీ, మంత్రీ, ఇతర ప్రముఖులూ చేరారు. ఆస్థాన జ్యోతిష్కుడు తన అధికార దుస్తులు ధరించి ప్రవేశించి తన సంచీ నుంచి రాజకుమారుల జాతకాలు పైకితీసి, పెద్దవాడిది చదువుకుని, తల పంకించి, చిన్నవాడిది కూడా చదువుకున్నాడు. తరవాత ఆయన రెండు కాగితం ముక్కలు తీసి రాజుగారి చేతికి ఇచ్చాడు. వాటిమీద పెద్ద అక్షరాలతో ఇద్దరు రాజకుమారుల పేర్లూ విడివిడిగా రాసి ఉన్నాయి.

జ్యోతిష్కుడు రాజు వద్దనుంచి పెద్దవాడి పేరు గల కాగితం తీసుకుని, దాన్ని రాజుగారి చేత తగల బెట్టించాడు. ఆయన ఆ బూడిద తన ఎడమ చేతిలోకి తీసుకుని, "పెద్ద రాజకుమారుడు రామ్‌గడ్ వెళ్లటం క్షేమం అయిన పక్షంలో ఈ తగలబడిన కాగితం నా చేతిలో ఎప్పటిలాగ అవుతుంది," అంటూ తన కుడి అరచేతిని ఎడమ అరచేతి పైన ఉంచి, చేతుల మీద ఒక చేతి గుడ్డ కప్పించుకుని, అరచేతులు రుద్దుకున్నాడు. తరవాత గుడ్డ తీసి చూస్తే కాగితం ఎప్పటిలాగా కాకపోగా కాగితం నుసి కూడా లేదు. తరవాత ఆయన రెండవ రాజకుమారుడి పేరు గల కాగితం ముక్కను తగల



బెట్టి, దాని నుసి కూడా అలాగే తన చేతుల మధ్య రుద్దాడు. అయితే ఈసారి ఆయన చేతుల మీద గుడ్డ తీసేసరికి ఆ కాగితం మళ్లీ ప్రత్యక్షమయింది. దాని మీద రెండో రాజకుమారుడి పేరు రాసి ఉన్నది!

"ఈ ప్రయోగాన్ని బట్టి చూడగా రాజు గారి పెద్ద అబ్బాయిగారు రామ్‌గడ్‌కు ప్రయాణం కావటం క్షేమం కాదని తెలుస్తున్నది. అందువల్ల కీడు కలగవచ్చు. పెద్దబాబూ, నువు ఇంటి వద్దనే ఉండి విశ్రాంతి తీసుకో. నా సలహా నచ్చిందా?" అన్నాడు జ్యోతిష్కుడు.

"మీ సలహా ప్రకారమే చేస్తాను," అన్నాడు పెద్ద రాజకుమారుడు.

రామ్‌గడ్ పర్యటన ముగించుకుని తిరిగి వచ్చినాక రాజు ఆస్థాన జ్యోతిష్కుణ్ణీ, ఇంద్రజాలికుణ్ణీ తన అభ్యంతర మందిరానికి పిలిపించి, ఇంద్రజాలికుడితో, "ఆ ఇంద్రజాలం ఎలా సాధ్యమయింది?" అని అడిగాడు.

"చాలా తేలిక, మహారాజా నేను మూడు కాగితం ముక్కలు తీసుకున్నాను. అన్నీ ఒకే రంగువి, ఒకే ప్రమాణం గలవీనూ. వాటిలో రెండిటి మీద చిన్న బ్బాయిగారి పేరు రాశాను. మూడోదాని మీద పెద్దబ్బాయిగారి పేరు రాశాను. జ్యోతిష్కుడి ఎడమ చేతికి వెడల్పయిన బంగారు ఆభరణం ఉన్నది. అది నవగ్రహ కంకణం. చిన్నబ్బాయిగారి పేరు గల రెండు కాగితం ముక్కలలో ఒకటి దాని కింద దూర్చి దాచాను. నా తరఫున ఆయనే ఇంద్రజాలం చేశాడు. అయితే ముందుగా అది ఆయన చేత చేయించి చూసుకున్నాను. చేతి గుడ్డ అడుగున కాగితం నుసి నలిపేటప్పుడు దాచిన కాగితం చేతిలోకి తీసుకోవటం కష్టం కాదు," అని ఆస్థాన ఇంద్రజాలికుడు చెప్పాడు.

రాజకుమారుడి ఆరోగ్యాన్ని కాపాడిన జ్యోతిష్కుడికీ, ఇంద్రజాలికుడికీ రాజు చెరొక ధనపు సంచీ బహూకరించాడు.



# చిన్ననాటి బోధ

ఒక బందిపోటు దొంగలముఠా నాయకుడు చాలా కాలానికి దొరికిపోయి మరణదండన విధించబడ్డాడు. అతని అనుచరులకు తమ నాయకుడి పైన అభిమానం ఉండేది. అందుచేత, అతను రాజభటులకు దొరకగానే వాళ్ళు రాజుకొడుకును ఎత్తుకుపోయి, తమ నాయకుణ్ణి వదలకపోతే యువరాజు ప్రాణాలు దక్కవని కబురు చేశారు. అయినా రాజు లక్ష్యపెట్టక దొంగల నాయకుడికి ఉరిశిక్ష వేశాడు.

రేపు ఉరితీస్తారనగా దొంగ కటకటాల వెనక కూర్చుని తన చిన్ననాటి విషయాలు జ్ఞాపకం తెచ్చుకున్నాడు. చిన్నతనంలో తన బొమ్మను మరొక కుర్రవాడు విరగగొట్టితే, తాను వాడి బొమ్మలాక్కుని దాన్ని విరవబోయాడు. అది చూసి తల్లి, "వాడి బొమ్మ విరిస్తే నీ బొమ్మ అతుకుతుందా, నాయనా ?" అని వాడి బొమ్మ వాడికి ఇప్పించింది.

తన తల్లి చిన్నతనంలోనే పోకపోతే తన జీవితం ఇంకోవిధంగా ఉండేది గదా అని వాడు అనుకుంటూండగా, మేలిముసుగు కప్పుకుని యువరాజు భార్య కటకాల వద్దకు వచ్చి, "అన్నా, నాకు పతిభిక్షపెట్టు!" అని ఏడ్చింది. దొంగ ఒక క్షణం ఆలోచించి, "అమ్మా, నీ భర్త ప్రాణాలకు ఏమీ ప్రమాదం లేదు. నువు వెళ్ళు," అన్నాడు.

తెల్లవారే లోపల యువరాజు క్షేమంగా తిరిగివచ్చాడు. మర్నాడు దొంగకు ఉరిశిక్ష రద్దయింది.

—అజీజ్





# దేవుడు సాక్షి

ఒక గ్రామంలో గోవిందప్ప అనే దొంగ ఉండేవాడు. దొంగతనం అతని కుల విద్య. అతని తండ్రి, తాతలు కూడా దొంగలే. గోవిందప్పకు ఒక చెల్లెలు ఉండేది. ఆమెకు దేవుడు అని ఒక కొడుకు ఉండేవాడు. ఆమె వాణ్ణి దొంగ తనం నేర్చుకునేటందుకు గోవిందప్ప వద్దకు పంపింది.

దేవుడికి పుట్టుకతోనే దొంగకు కావలసిన లక్షణాలు ఏర్పడ్డాయి. అందుచేత వాడు మేనమామ శిక్షణలో అతన్ని మించిన దొంగగా తయారు అయాడు. గోవిందప్ప దేవుణ్ణి వెంట పెట్టుకోకుండా దొంగతనానికి బయలుదేరేవాడు కాడు.

ఒకసారి గోవిందప్పా, దేవుడూ కలిసి దొంగతనానికిగాను మరొక గ్రామం వెళ్ళారు. వారు అక్కడికి చేరేసరికి చీకటిపడింది. అక్కడి న్యాయాధికారి శ్రీమంతుడు. ఆ సంగతి తెలిసి వాళ్ళు ఆ న్యాయాధికారి ఇంట దొంగతనం చేద్దామనుకున్నారు.

న్యాయాధికారికి పిల్లలులేరు. అయినా, ఆయన భార్య తరచు ఏవో నోములు నోచి, ఉపవాసాలుండేవారు. న్యాయాధికారి ప్రతిరోజూ చాలా పొద్దుపోయి ఇంటికి వచ్చేవాడు. ఈ సంగతి తెలిసి, గోవిందప్పా, దేవుడూ పెందలాడే తమ పని ముగించుకుందా మనుకున్నారు.

''నాకు ఆకలి దహించుకుపోతున్నది; తినటానికి ఏమన్నా దొరుకుతుందేమో చూస్తాను,'' అన్నాడు దేవుడు.

''నేను మేడ మీదికి వెళ్ళి ఏమైనా దొరుకుతుందేమో చూస్తాను. నువు ముందు వచ్చినా, నేను ముందు వచ్చినా ఈ చెట్టు కింద ఉండాలి.'' అన్నాడు గోవిందప్ప. అతను పైకి వెళ్ళాడు.

గుద్దేటి నాగేశం

దేవుడు లోపల ప్రవేశించి, దగ్గరగా వేసి ఉన్న తలుపు గడియపెట్టి, పిల్లి లాగా చప్పుడు చెయ్యకుండా వంటింటి దాకా వెళ్ళి, లోపలికి తొంగి చూశాడు. ఇల్లు నిశ్శబ్దంగా ఉన్నది. న్యాయాధికారి భార్య కొంగుపరుచుకుని కునుకు తీస్తున్నది. దేవుడి మందిరం ముందు వంటకాలు పెట్టి ఉన్నాయి.

సంగతి ఏమంటే, ఆనాడు ఏకాదశి. న్యాయాధికారీ, భార్యా రోజంతా ఉపవాసం చేశారు. రాత్రి తినటానికి భార్య పాయసమూ, పెసరట్టులూ చేసి, భర్త కోసం ఎదురుచూస్తూ నడుమువాల్చింది. ఉపవాసం చేసి ఉండటాన ఆమెకు నిద్ర వచ్చింది.

దేవుడు మెల్లిగా వంటకాల వద్దచేరి పాయసమూ, పెసరట్లూ పూర్తిగా తినేశాడు. ఇంకా ఉంటే తినేవాడే కూడానూ. వాడు జన్మలో ఎన్నడూ అలాంటివి తిని ఎరగడు. వాడు వచ్చినట్టే వెళ్ళి పోదామనుకుంటుండగా వీధివాకిలి తలుపు ఎవరో గట్టిగా బాదారు.

ఆ చప్పుడుకు నిద్రపోతున్న ఇల్లాలు లేచి, "వచ్చె వచ్చె," అంటూ వెళ్ళిపోయింది. బయటికి జారుకునే అవకాశం లేక దేవుడు వంట ఇంట్లో అటక మీదికి ఎక్కి దాక్కున్నాడు.



ఆ వచ్చినవాడు న్యాయాధికారి. ఆకలి దహించుకు పోతూండటం వల్ల ఆయన తిన్నగా వంట ఇంట్లోకి వచ్చి, వంట సిద్ధమయిందా అని భార్యను అడిగాడు.

"మీ కోసమే చూస్తున్నాను," అంటూ ఆమె వచ్చి చూస్తే పాత్రలు ఖాళీగా ఉన్నాయి.

న్యాయాధికారి కోపం ఆపుకోలేక, "నేను వచ్చినదాకా ఆగలేక అంతా నువే తిని ఉంటావు?" అన్నాడు భార్యను.

"నేనా? మీరు తినకుండా నేను ఏనాడన్నా తిన్నానా? నేను తిన్నదీ, లేనిదీ దేవుడు చూస్తూనే ఉన్నాడే!" అన్నదామె.

"నువు తినకపోతే ఇంకెవరు తింటారు? అన్నాడు భర్త.

"నాకు కాస్త కునుకు పట్టింది. ఆ సమయంలో దేవుడు తిన్నాడేమో!" అన్నది భార్య.

"దేహశుద్ధి చేస్తేగాని నువు నిజం చెప్పవు!" అని భర్త అవతలికి వెళ్ళి ఒక కఱ్ఱ తెచ్చాడు.

ఇదంతా చూస్తున్న దేవుడికి న్యాయాధికారి మీద కోపం వచ్చింది. వాడు అటక మీది నుంచి భార్యా భర్తల మధ్యకు దూకి, "ఆవిడ నిజమే చెప్పింది. నేనే దేవుణ్ణి. మీ ఇద్దరి ఫలహారమూ నేనే తినేశాను! ఆవిణ్ణి ఎందుకు నిష్కారణంగా కొట్టడం?" అన్నాడు.

న్యాయాధికారి తెల్లమోహం వేసి దేవుడి కేసి చూస్తూ ఉండి పోయాడు.

ఇంతలో బయటి నుంచి, "దేవుడూ!" అంటూ చిన్నగా పిలుపు వచ్చింది.

"వస్తున్నా!" అంటూ దేవుడు దర్పంగా బయటికి వెళ్ళిపోయాడు.

గోవిందప్ప మేడ మీద ఎంత వెతికినా డబ్బు దొరకలేదు. కొంతసేపటికి అతడికి వంటింట్లో నుంచి గట్టిగా మాటలు వినిపించాయి. దగ్గిరికివచ్చి వింటే, "దేవుడు" అన్న మాటా, దేవుడి గొంతూ వినిపించాయి. తన మేనల్లుడు ఇంటి వారికి దొరికిపోయాడని భయపడి, పిలిచి చూశాడు. దేవుడు వస్తున్నాననటం విని గోవిందప్పకు ఆశ్చర్యం కలిగింది.

వాళ్ళిద్దరూ తిరిగి పోయేటప్పుడు దేవుడు చేసినదంతా విని గోవిందప్ప, "దొంగ అంటే నువే దొంగవురా! దొంగ తనం చేసిందిగాక, చేశానని ఇంటిల్లి పాదికీ చెప్పివచ్చేశావు!" అని మెచ్చు కున్నాడు.

న్యాయాధికారి భార్యకు వాళ్ళు దొంగలై ఉంటారని తట్టి, "పట్టుకోండి! పట్టుకోండి! అలా నిలబడతారేం?" అని హెచ్చరించిన మీదట న్యాయాధికారి బయటికి పరిగెత్తాడు. కాని అప్పటికే దొంగలు కనుమాటు అయారు.



# తీర్పు రద్దు

దానయ్యకూ, అతని భార్యకూ క్షణం కూడా పడేదికాదు. దానయ్యతో వేగలేక అతని భార్య తన కూతుర్ని ఎత్తుకుని పుట్టింటికి బయలుదేరింది. దానయ్య బిడ్డను ఉంచి పొమ్మన్నాడు. భార్య రాజుగారితో మొరపెట్టుకున్నది. రాజు దానయ్య చెప్పినదంతా విని, అతని భార్యతో, "నువు నీ పుట్టింటి నుంచి కాపరానికి వచ్చినప్పుడు నీకు బిడ్డ లేదు కద! భర్త వల్ల పుట్టిన బిడ్డను భర్తకే ఇచ్చి నువు వట్టిచేతులతో పుట్టింటికి వెళ్ళటమే న్యాయం!" అన్నాడు.

దానయ్య కూతురు తండ్రి దగ్గిరే పెరిగి పెద్దదయింది. రాజుగారు తన విషయంలో తన తల్లికి విరుద్ధంగా తీర్పు చెప్పిన మాట ఆమెకు తెలుసు. తండ్రి అప్పుడప్పుడూ తనకు ఇస్తూ వచ్చిన డబ్బులు పోగుచేసి, చివరకు ఆమె రెండు కోడెదూడలను కొని, వాటిని తీసుకు పోయి, రాజుగారి ఆవుల మందలు మేసే చోట మేపుతూ వచ్చింది.

ఇంతలో రాజుగారి ఆవులలో ఒకటి దూడను పెట్టింది. దానయ్య కూతురు ఆ దూడను ఎత్తుకుని తన ఇంటికి తీసుకుపోయింది. ఆ మాట రాజుకు తెలిసి, ఆమెను పిలిపించి సంజాయిషీ అడిగాడు.

"మహారాజా, ఈ దూడకు తండ్రి నా సొంత ఎద్దు. బిడ్డలు తండ్రికే చెందాలని తీర్పు చెప్పి, నన్ను మీరు మా నాన్నకు ఇప్పించి ఉన్నారు గద!" అన్నది.

రాజు సిగ్గుపడి, తన తీర్పును రద్దుచేసి, ఆమెను తల్లికి ఇప్పించాడు. తరవాత కూతురు కోసం దానయ్య భార్యతో జగడాలు మానేశాడు.





# సొంతకొడుకు

ధర్మయ్యకు వీరుడు అని ఒక్కడే కొడుకు. ధర్మయ్య మొదట కొద్దిపాటి స్థితిమంతుడే అయినా, తన తెలివి తేటలతో ఉన్న ఆస్తి పెంచుకుని మంచి ఆస్తిపరుడు అయాడు. వీరుడు మాత్రం చిన్నతనం నుంచీ ఆకతాయిగా పెరిగి, చదువు సంధ్యలు లక్ష్యపెట్టక, డబ్బు విచ్చలవిడిగా ఖర్చు చెయ్యటంలో ప్రావీణ్యం సంపాదించసాగాడు. ధర్మయ్య తన కొడుకును నయానా, భయానా మార్చలేకపోయాడు.

ఈ స్థితిలో ఒకనాడు, పక్కగ్రామంలో ఉండే కామయ్య అనే స్నేహితుడు ధర్మయ్యను చూడవచ్చి, మాటల సందర్భంలో, "ఏమిటి ధర్మయ్యా? నీ కొడుకు వాలకం చూస్తే నీకు కీర్తి తెచ్చేటట్టు లేదే! పనీపాటా లేకుండా సోమరిలా తిరిగితే ఎలా?" అన్నాడు.

వీరుణ్ణి మార్చటానికి కామయ్య ఒక ఉపాయం చెప్పాడు. ఆ ఉపాయం పారుతుందో, లేదోనని ధర్మయ్యకు అనుమానం ఉన్నప్పటికీ, కొడుకు మారితే చాలునన్న ఉద్దేశంతో కామయ్య చెప్పినట్టు చెయ్యటానికి ధర్మయ్య ఒప్పుకున్నాడు.

తరవాత నాలుగు రోజులకు ఒక ముసలివాడు ఒక పదిహేనేళ్ల కుర్రవాణ్ణి వెంటబెట్టుకుని వచ్చి, ఏదన్నా పని చూపించమని ధర్మయ్యను వేడుకున్నాడు.

"మీరు ఏం పనులు చేయగలరు?" అని ధర్మయ్య అడిగాడు.

ముసలివాడు కుర్రవాణ్ణి చూపించి, "వీడు అన్ని పనులూ చెయ్యగలడు. నేను ముసలివాణ్ణి గనక మీ ఇల్లు కనిపెట్టుకుని ఉంటాను," అన్నాడు.

ఎన్. అరుణా శ్రీనివాస్

వాళ్ళు అలా మాట్లాడుకుంటూ ఉండగా వీరుడు ఎక్కడి నుంచో తిరిగి వచ్చి, ఇంట్లోకి పోబోయాడు. వీరుణ్ణి చూస్తూనే ముసలివాడు, "సోమూ!" అంటూ మూర్ఛపోయాడు.

ధర్మయ్య నౌకర్లను పిలిపించి, ముసలివాణ్ణి ఇంట్లోకి చేర్చి, శైత్యోపచారాలు చేయించాడు. ముసలివాడు, తెలివి వస్తూనే, "సోమూ!" అంటూ భోరున ఏడ్చాడు. అతను వీరుణ్ణి దగ్గిరికి పిలిచి, వీరుడి కాలిమీద పొడుగాటి మచ్చను చూపిస్తూ, ధర్మయ్యకేసి తిరిగి, "బాబుగారూ, నేను మీకు గుర్తున్నానా? పదిహేనేళ్ళ క్రితం రామాపురం వరదల్లో కొట్టుకుపోతున్న మిమ్మల్ని, మీ అబ్బాయినీ గట్టుకు చేర్చాను కాదా?" అని అడిగాడు.

ధర్మయ్య గుర్తు తెచ్చుకుంటున్నట్టు చూసి, "నువా! బాగున్నావా? ఇలా అయిపోయావేం?" అంటూ ముసలివాడితో కుశలప్రశ్నలు వేశాడు.

"బాబూ, నా మాట వినండి. ఆ హడావుడిలో మీరు నా మనవణ్ణి మీ అబ్బాయి అనుకుని తీసుకుపోయారు. మీ పసిగుడ్డును తీసుకుని, గుర్రబ్బండి వెనక చాలా దూరం పరిగెట్టాను, కాని అందుకోలేక పోయాను. ఇడుగో, వీడే! ఎంతో



ముద్దుగా పెంచాను. కాని పేదవాణ్ణి కావటంచేత పని చేయించక తప్పలేదు," అంటూ ముసలివాడు తన వెంట వచ్చిన కుర్రవాణ్ణి చూపాడు.

ధర్మయ్య వాణ్ణి దగ్గిరికి తీసుకుని, తల నిమురుతూ, "నాయనా, వీరుడూ!" అని కళ్ళు ఒత్తుకున్నాడు.

ముసలివాడు వీరుణ్ణి దగ్గిరికి తీసుకుని, "నా మనవణ్ణి ఇన్నాళ్ళూ మీరు మహారాజులా పెంచారు. మీ రుణం తీర్చుకోలేను," అన్నాడు.

వీరుడికి అంతా అయోమయంగా ఉన్నది, కాని ఒక్క విషయం స్పష్టమయింది: తాను ధర్మయ్య కొడుకు

కాదు, ముసలివాడి మనవడు; తన పేరు వీరుడు కాదు, సోముడు. ఆ సంగతి తలచుకుంటే వాడికి పుట్టెడు దుఃఖం వచ్చింది.

ముసలివాడు వీరుణ్ణి తీసుకుని వెళ్ళి పోబోతే, ధర్మయ్య అగమని, ఇద్దరినీ తన ఇంటనే ఉండమన్నాడు. అది మొదలు వీరుడు ధర్మయ్య చెప్పిన పనులు చేస్తూ, చదువు కూడా నేర్చుకున్నాడు. చదువు ఉంటేనేగాని మనిషి ఎందుకూ కొరగాడని ధర్మయ్య చెప్పి, వీరుణ్ణి ఆ ఊరి పంతులుగారి వద్ద చదువుకు పెట్టాడు.

త్వరలోనే వీరుడు మెరికలాగా తయారయాడు. వాడికి కొంత చదువు వచ్చింది, పనులన్నీ చేతనయాయి. వాడు ఒక నాడు ధర్మయ్యతో తాను తన తాతను పోషించుకోగలనని చెప్పాడు.

వెంటనే ధర్మయ్య మనిషి ద్వారా కబురు పంపి, పారుగూరి నుంచి కామయ్యను పిలిపించాడు.

కామయ్య వస్తూనే, "ధర్మయ్యా, ఇన్నాళ్ళూ నా కొడుకును నీ ఇంట ఖైదీగా ఉంచుకున్నావు. అందుకు నేను నీ కొడుకు వీరుడికి శిక్ష విధించబోతున్నాను," అన్నాడు.

"ఏమి శిక్ష విధిస్తావు?" అని ధర్మయ్య అడిగాడు.

"నా పెంకె కూతుర్ని మీ వీరుడికిచ్చి పెళ్ళి చేస్తాను. ఏమంటావు, ధర్మయ్యా?" అన్నాడు కామయ్య.

వాళ్ళ మాటలు వింటూ ఉన్న కొద్దీ వీరుడికి జరిగిన నాటకం అర్థమయింది. తన పేరు వీరుడే, తన తండ్రి ధర్మయ్యే. ముసలివాడి వెంట వచ్చిన కుర్రవాడు కామయ్య కొడుకు. తనను ఒక మనిషిని చెయ్యటానికిగాను ఇద్దరూ కూడబలుక్కుని ఈ నాటకం ఆడారు.

వీరుడు తండ్రి కాళ్ళమీద పడి, "నాన్నగారూ, నన్ను క్షమించండి. ఇంకెన్నడూ నన్ను వేరుచెయ్యకండి." అన్నాడు.





# కలిమి-లేమి

ఒక ఊళ్ళో ధనగుప్త డనే వ్యాపారి ఉండేవాడు. అతడు తన జీవితమంతా ధనార్జనలోనే గడిపి, లెక్కలేనంత డబ్బు సంపాదించాడు. అతడు వృద్ధాప్యంలో పక్షవాతంతో మంచానపడి, "నా జీవిత మంతా కేవలమూ డబ్బు సంపాదనలోనే గడిచిపోయింది. నా సంపాదనతో ఇతరు లకు ఉపయోగపడే ఏ ఒక్క మంచి పనీ చెయ్యలేదు,'' అని పశ్చాత్తాప పడ్డాడు.

ఇలా అనుకుని అతడు తన కొడుకైన శ్రీగుప్తుణ్ణి పిలిచి, "నాయనా, నా జీవి తంలో ప్రజోపయోగమైన పని ఒక్కటీ, చెయ్యలేదు. నువు నీ అవసరాలకు డబ్బు ఉంచుకుని, కొంత డబ్బుతో ఒక ధర్మశాల కట్టించు,'' అని చెప్పి కన్ను మూశాడు.

తండ్రి అంత్యక్రియలు పూర్తికాగానే శ్రీగుప్తుడు వ్యాపారంలో మునిగి పోయాడు. ఆ సంవత్సరం అతనికి బాగా లాభం వచ్చింది. అతనికి తండ్రి చని పోతూ చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి.

"వచ్చే సంవత్సరం నష్టం రావచ్చు, ఖర్చు పెరగవచ్చు. పై సంవత్సరం ఇంకా లాభాలు వస్తే ధర్మశాల కట్టి స్తాను,'' అని అతను అనుకున్నాడు.

మరుసటి సంవత్సరం కూడా అమి తంగా లాభాలు వచ్చాయి. అయినా అత నికి తృప్తి కలగలేదు. అతను ధర్మశాల నిర్మాణం మళ్ళీ వాయిదా వేశాడు.

ఒకరోజు రాత్రి శ్రీగుప్తుడు చాలా పొద్దు పోయే వరకూ లెక్కలు చూసుకుంటూ మేలుకుని ఉన్నాడు. అప్పుడు ఎవరో బాధతో మూలుగుతూ, అతని ఇంటి ముందున్న అరుగు మీదికి వచ్చి కూర్చు న్నారు. శ్రీగుప్తుడు కిటికీలో నుంచి చూస్తే

ప్రత్తిపాటి రామకృష్ణారావు

ఒక ముసలి, గుడ్డి బిచ్చగాడు అరుగు మీద కూర్చుని, తాను పెట్టిన సత్తు గిన్నెనూ, జోలెనూ తడుముకుంటూ దగ్గిరికి తీసుకోవటం కనిపించింది.

ఇంతలో అరుగు దగ్గిరికి కుంటు కుంటూ మరొక బిచ్చగాడు వచ్చి, "చింపిరయ్యా, ఎందుకు అలా మూలుగుతున్నావు? ఏమయింది?" అని అడిగాడు.

చింపిరయ్య బాధతో, "నువా, నారాయుడూ? గుడ్డి వెధవని! ఉదయం అడుక్కుంటూ వస్తూంటే కాలిలో మేకు దిగబడింది. మేకు తీశాను గాని, కాలు వాచింది. కదలలేక పోయాను. పట్టెడు మెతుకులు దొరకలేదు. ఒకపక్క కాలి బాధా, ఇంకోపక్క ఆకలి బాధా చంపేస్తున్నాయనుకో!" అన్నాడు.

నారాయుడు చింపిరయ్య కాలు వంక చూశాడు. అదిబాగా వాచిపోయి ఉన్నది. నారాయుడు తన సంచీలో నుంచి గిన్నె తీస్తూ, "నీ కాలి బాధ తగ్గించటం నా వల్ల కాదుగాని, ముందు ఈ అన్నం తిను," అంటూ తన గిన్నెను గుడ్డివాడికి ఇచ్చాడు.

"నువు తిన్నావా? అడుక్కున్నదంతా నాకే పెడుతున్నావా?" అన్నాడు చింపిరయ్య.

"ఇద్దరికీ సమంగా పంచానులే. నా వంతు నీ గిన్నెలోకి తీసుకున్నాను," అన్నాడు నారాయుడు రెండు మెతుకులు తీసి ముసలివాడి గిన్నెలో వేసి తాను తీసుకుంటూ.

ఇదంతా కిటికీలో నుంచి చూస్తున్న శ్రీగుప్తుడికి కనువిప్పు కలిగింది. తనకున్న దానిలో కొంత పంచిఇచ్చిన నారాయుడిది నిజమైన కలిమి, ఎవరికీ ఏమీ ఇవ్వలేని తనది లేమి!

ఆ రాత్రి శ్రీగుప్తుడు ఆ బిచ్చగాళ్ళిద్దరికీ ఆశ్రయ మిచ్చి, మర్నాడు ఉదయం చింపిరయ్య కాలుకు చికిత్స చేయించి, ఆ రోజే ధర్మశాల నిర్మాణం పని ప్రారంభించాడు.






రాక్షస స్త్రీలు చెప్పిన మాటలు విని రావణుడికి కోపం వచ్చింది. అతను బలవంతులూ, శూరులూ అయిన రాక్షసులను పిలిచి, హనుమంతుణ్ణి పట్టుకోమని ఆజ్ఞాపించాడు. ఆ రాక్షసులు ఆయుధాలు తీసుకుని హనుమంతుడి మీదికి బయలుదేరారు. వారికి హనుమంతుడు అశోకవన ద్వారంవద్ద కనిపించాడు. వాళ్ళు అతన్ని చుట్టుముట్టారు. అప్పుడు మహాకాయుడైన హనుమంతుడు తోకతో నేలను కొట్టి, గట్టిగా అరిచి, తన భుజం చరుచుకున్నాడు. ఆ ధ్వని లంక అంతటా వినిపించింది.

తరవాత హనుమంతుడు కళ్ళెర్రచేసి, ఇలా అరిచాడు:

"రామలక్ష్మణులకు జయం! రాముడి ప్రాపుగల సుగ్రీవుడికి జయం! కోసల రాజైన రాముడి దాసుణ్ణి! శత్రు నాశకుణ్ణి! వాయు పుత్రుడైన హనుమంతుణ్ణి! చెట్లతోనూ, రాళ్ళతోనూ యుద్ధం చేస్తూ వెయ్యి మంది రావణులను ఎదిరించగలను. రాక్షసులు చూస్తూండగానే లంకాపట్టణం ధ్వంసంచేసి, సీతకు నమస్కరించి, రాముడి వద్దకు పోతాను."

అది విని రాక్షససైనికులు భయపడి కూడా, రాజాజ్ఞ చొప్పున యుద్ధంచేయ నిర్ణయించి, హనుమంతుడి పైన అనేక ఆయుధాలు ప్రయోగించారు. హనుమంతుడు ఆ ద్వారం సమీపంలో ఉన్న ఇనుప పరిఘ తీసుకుని, రాక్షసుల నంద

**15. రాక్షసులతో యుద్ధం**



రినీ చంపి, తిరిగి ద్వారంవద్ద నిలబడ్డాడు. భయపడి పారిపోయిన రాక్షసులు వెళ్ళి రావణుడితో సైనికులు చచ్చిన వార్త చెప్పారు.

రావణుడు మరింత మండిపడి హనుమంతుడి మీదికి మహావీరుడైన ప్రహస్తుడి కొడుకును పంపాడు.

ఈ లోపుగా హనుమంతుడి దృష్టి చైత్యప్రాసాదం మీద పడింది. దాన్ని ఎందుకు ధ్వంసం చెయ్యకూడదనుకుని, అతను దాని పైకి దూకి, దాన్ని నాశనం చేసి, సింహనాదం చేశాడు. ఇంతలో చైత్యప్రాసాద రక్షకులు ఆయుధాలతో అతని పైకి వచ్చారు. హనుమంతుడు ఒక స్తంభాన్ని పెరికి, దాన్ని గిరగిరా తిప్పి, నూరు మంది రాక్షసులను చంపాడు.

ఇంతలోపల ప్రహస్తుడి కొడుకు జంబుమాలి విల్లూ, బాణాలూ తీసుకుని హనుమంతుడి మీదికి గాడిదలు కట్టిన రథం మీద వచ్చాడు. అతన్ని చూడగానే హనుమంతుడు యుద్ధోత్సాహంతో సింహనాదం చేశాడు.

ద్వారం పైన ఉండే దూలం మీద కూర్చుని ఉన్న హనుమంతుడి పైన జంబుమాలి బాణాలు వేశాడు. అవి ముఖానా, నెత్తినా, చేతులకు తగిలి, రక్తం మూలంగా హనుమంతుడు మరింత ఎర్రగా కనిపించాడు. అతను తన పక్కనే ఉన్న పెద్దరాయి ఎత్తి, జంబుమాలి మీద గట్టిగా విసిరాడు. జంబుమాలి ఆ రాతిని బాణాలతో పడగొట్టాడు. అలాగే అతను హనుమంతుడు విసిరిన సాలవృక్షాన్ని కూడా బాణాలతో నరికి, మరి కొన్ని బాణాలతో హనుమంతుణ్ణి కొట్టాడు. హనుమంతుడు అమితమైన కోపంతో పరిఘను తీసుకుని, గిరిగిరా తిప్పి, జంబుమాలి మీదికి విసిరాడు. దాని దెబ్బకు జంబుమాలీ, అతని రథమూ, గాడిదలూ గుర్తించరాకుండా నుగ్గు అయిపోయాయి.

జంబుమాలి చచ్చాడని వినగానే రావణుడికి కోపంతో కణతలు అదిరాయి. అతను తన మంత్రి పుత్రులను ఏడుగురిని అగ్నిహోత్రాల వంటి తేజస్సుగల వారిని, సైన్యంతోసహా పంపాడు. హనుమంతుణ్ణి నేను చంపుతానంటే, నేను చంపుతానని ఒకరిమీద ఒకరు పోటీలు పడుతూ, వాళ్ళు గుర్రాలు పూన్చిన రథాల మీద బయలుదేరారు.

వాళ్ళు అశోకవన ద్వారం చేరుతూనే హనుమంతుడి మీద బాణవర్షం కురిపించారు. హనుమంతుడు ఆ బాణాలు తనకు తగలకుండానూ, వాళ్ళ గురికి అందకుండానూ ఆకాశంలో అటూ, ఇటూ ఎగిరాడు. అతని అరుపులకు రాక్షసులు భయపడ్డారు. హనుమంతుడు వాళ్ళను చేత్తో కొట్టి, కాళ్ళతో తన్ని, పిడికిలితో పొడిచి, గోళ్ళతో చీరాడు. చాలామంది రాక్షసులు ఇలా చచ్చారు. చచ్చినవాళ్ళు చావగా, మిగిలిన వాళ్ళు ఆర్తనాదాలు చేస్తూ పారిపోయారు.

హనుమంతుడు తిరిగి ద్వారం వద్దకు చేరాడు. అతనికి ఇంకా యుద్ధం చెయ్యాలని ఉన్నది.

మంత్రి పుత్రులు కూడా హనుమంతుడి చేతిలో చచ్చారనే సరికి రావణుడికి కొంచెం భయంకలిగింది. కాని అతను దాన్ని పైకి కనబడనియ్యక, తన సేనానాయకులలో అయిదుగురిని, విరూపాక్షుడూ, యూపాక్షుడూ, దుర్ధరుడూ,





ప్రఘసుడూ, భావకర్ణుడూ అనేవాళ్ళను ఉద్దేశించి, "మీరందరూ రథాలతోనూ, ఏనుగులతోనూ వెళ్ళి ఆ వానరుణ్ణి శిక్షించండి. అతని విషయంలో మీరు ఏ మాత్రమూ అలక్ష్యంగా ఉండవద్దు. అతను వానరుడని నాకు అనిపించటం లేదు. అదేదో మహాబలం గల భూతంలా గున్నది. ఏ ఇంద్రుడైనా తపస్సు చేసి మనని చంపటానికి ఈ భూతాన్ని సృష్టించాడేమో; నాకు లోగడ వాలీ, సుగ్రీవుడూ, జాంబవంతుడూ, నీలుడూ, ద్వివిదుడూ మొదలైన వానరవీరులు బాగా తెలుసు. వారెవరికీ ఇంత బలమూ, శక్తీ లేవు. మీరు మీ శక్తినంతా ధారపోసి ఈ వానరుణ్ణి ఎలాగైనా పట్టుకోండి. ఆత్మరక్షణ చేసుకోవటం విషయంలో మీరు అజాగ్రత్తగా ఉండకండి," అని హెచ్చరించాడు.

రాజాజ్ఞ శిరసావహించి అయిదుగురు సేనాపతులూ రథాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ, రకరకాల ఆయుధాలనూ తీసుకుని హనుమంతుడున్న చోటికి వచ్చారు. వాళ్ళు హనుమంతుణ్ణి చుట్టుముట్టి, అతని మీద అనేక ఆయుధాలు ప్రయోగించారు. వాళ్ళ బాణాలు కొన్ని హనుమంతుడి తలకు గుచ్చుకున్నాయి. వెంటనే హనుమంతుడు సింహనాదం చేస్తూ ఆకాశంలోకి ఎగిరాడు. అప్పుడు దుర్ధరుడు ఆకాశంలోకి వందల కొద్దీ బాణాలు వేశాడు. హనుమంతుడు వాటిని తప్పుకుంటూ, శరీరం పెంచి, పిడుగు పడినట్టుగా దుర్ధరుడి రథం మీదికి దూకాడు. ఆ దెబ్బకు దుర్ధరుడి రథపు గుర్రాలు ఎనిమిదితోపాటు దుర్ధరుడు కూడా చచ్చాడు.

తరవాత హనుమంతుడు ఒక మద్ది చెట్టు పెరికి, దానితో విరూపాక్షుణ్ణీ, యూపాక్షుణ్ణీ చంపాడు. తరవాత ప్రఘసుడూ, భావకర్ణుడూ హనుమంతుడితో యుద్ధం చేశారు. ఒక పర్వతశిఖరం పెకలించి, హనుమంతుడు దానితో వారిద్దరినీ, సేననూ చంపాడు.

తరవాత అతను మళ్ళీ ద్వారం వద్ద నిలబడ్డాడు.

అయిదుగురు సేనానాయకులూ చచ్చిన వార్తరాగానే రావణుడు తన కొడుకైన అక్షుడి కేసి చూశాడు. యుద్ధం అంటే అమితమైన ఆసక్తిగల అక్షుడు, తండ్రి చూపే ఆజ్ఞగా భావించి, చప్పున లేచాడు. అతను ఒక బంగారు రథం మీద హనుమంతుడున్న చోటుకు వెళ్ళాడు. ఎనిమిది గుర్రాలుగల అక్షుడి రథం నేలను అంటకుండానే పోగలది. దాని నిండా ఎప్పుడూ ఆయుధాలు ఉంటాయి.




అక్షుడు హనుమంతుణ్ణి చూస్తూనే అతను అసాధారణ వీరుడన్న సంగతి గ్రహించి, పెద్ద ఎత్తున యుద్ధానికి సిద్ధపడ్డాడు. ఇద్దరూ చాలా తీవ్రమైన యుద్ధం ప్రారంభించారు. అక్షుడు వేసిన రకరకాల బాణాలు హనుమంతుడికి తగిలి, అతని యుద్ధోత్సాహాన్ని పెంచాయి. అతను ఆకాశంలోకి ఎగిరాడు. అక్షుడు కూడా తన రథంతోపాటు ఆకాశంలోకి లేచి, హనుమంతుడి మీద బాణాలు వేయసాగాడు. హనుమంతుడు వాటిని తప్పుకుంటూ ఆకాశంలో తిరుగుతూ, అక్షకుమారుణ్ణి చంపే మార్గం ఆలోచించాడు. చిన్నతనంలోనే ఇంత పరాక్రమంగల అక్షుడు, చంపకుండా విడిచిపెడితే, ముందు ముందు ఎంతైనా బాధిస్తాడు. అందుచేత, హనుమంతుడు ఉపాయంగా, తలవని తలంపుగా, అక్షుడి కాళ్ళు పట్టుకుని, గిరగిరా తిప్పి, బలంగా నేలకేసి కొట్టాడు. ఆ దెబ్బకు అక్షుడు చచ్చిపోయాడు.

అక్షుడి చావు వినగానే రావణుడికి దుఃఖమూ, కోపమూ కూడా కలిగాయి. ఆయన దుఃఖాన్ని అణచుకుని, తన కొడుకైన ఇంద్రజిత్తును చూసి, "ఈ వానరుడు ఇప్పటికి జంబుమాలినీ, మంత్రి పుత్రులనూ, అయిదుగురు సేనాపతులనూ, చాలా సేననూ, నీ తమ్ముడైన



ఇంద్రజిత్తు తన పైన బాణాలు వెయ్య నారంభించగానే, హనుమంతుడు ఆకాశం లోకి ఎగిరి, ఆ బాణాలను తప్పుకుంటూ సంచరించసాగాడు. తాను వేసిన ఒక్క బాణమూ హనుమంతుడికి తగలకపోయే సరికి ఇంద్రజిత్తు చిరాకు పడ్డాడు. హను మంతుణ్ణి చంపటం అసాధ్యమని అతనికి తెలిసిపోయింది. కనీసం హనుమంతుణ్ణి పట్టుకునే ఉద్దేశంతో అతను బ్రహ్మాస్త్రం సంధించాడు. దానితో హనుమంతుడు కట్టుపడి, ఆకాశంలో నుంచి కింద పడిపోయి, ఏమీ చెయ్యలేని స్థితిలో ఉండిపోయాడు.

అక్షుణ్ణీ చంపాడు. అందుచేత అతని బలం సరిగా అంచనా వేసుకుని యుద్ధం చెయ్యి. నువు యుద్ధంలో నా అంత వాడివి, దేవతలను కూడా జయించ గలవు. నువు సేనలను తీసుకుపోవద్దు; నీ అస్త్రాలను మాత్రమే నమ్ముకో. నిన్ను నువు తేలికగా రక్షించుకోగలవని పంపు తున్నాను,'' అన్నాడు.

ఇంద్రజిత్తు తండ్రికి ప్రదక్షిణ చేసి, యుద్ధానికి బయలుదేరాడు. అతను రథం మీద వెళ్ళి త్వరలోనే హనుమంతుణ్ణి చేరుకున్నాడు. ఇంద్రజిత్తు రావటం చూసి హనుమంతుడు సంతోషంతో సింహనాదం చేశాడు.

తాను బ్రహ్మాస్త్రంతో పట్టుబడ్డట్టు హను మంతుడు గ్రహించాడు. ఏ అస్త్రంచేతా పట్టుబడకుండా బ్రహ్మదేవుడు తనకు వరం ఇచ్చి ఉన్న సంగతి జ్ఞాపకం తెచ్చు కుని, హనుమంతుడు కొంతసేపు బ్రహ్మా స్త్రానికి కట్టుబడి ఉండ నిశ్చయించాడు. తనను, బ్రహ్మ, దేవేంద్రుడూ, వాయువూ రక్షిస్తారుగనక ప్రమాదం కలగదని కూడా అతను నమ్మాడు. అదీగాక ఇప్పుడు తనకు రావణుడితో మాట్లాడే అవకాశం కూడా కలుగుతుంది.

కదలకుండా పడి ఉన్న హనుమంతుణ్ణి రాక్షసులు సమీపించి, అతన్ని తాళ్ళతో బంధించారు. హనుమంతుడు బంధించ

బడగానే బ్రహ్మాస్త్రం అతన్ని వదిలేసింది. ఇతర బంధాలున్న చోట బ్రహ్మాస్త్రబంధం నిలవదు. ఇంద్రజిత్తు ఈ సంగతి ఎరిగి ఉండంచేత, అజ్ఞానులైన రాక్షసులు హనుమంతుణ్ణి నారతాళ్ళతో బంధించి నందుకు విచారించాడు. అయితే రాక్షసులు తనను తీసుకుపోతున్నప్పుడు కూడా, తనను బ్రహ్మాస్త్రం విడిచిన సంగతి హనుమంతు డెరగడు.

రాక్షసులు హనుమంతుణ్ణి కర్రలతో కొట్టుతూ, పిడికిళ్లతో పొడుస్తూ, విజయోత్సాహంతో కేకలు పెడుతూ రావణుడి వద్దకు తీసుకుపోయారు.

ఇంద్రజిత్తు హనుమంతుణ్ణి రావణుడికీ, సభికులకూ చూపి, "ఇతనే ఆ వానరుడు," అని పరిచయం చేశాడు. మదించిన ఏనుగులాగున్న హనుమంతుణ్ణి చూసి, రావణాసురుడి సభలో వాళ్ళు తమలో తాము, "ఎవడీ వానరుడు? ఎవరి తరఫున వచ్చాడు? ఇక్కడికి ఎందుకు వచ్చాడు? ఏం పని మీద వచ్చాడు? ఈ లంకలో ఎవరితో పని ఉండి వచ్చాడు?" అంటూ ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు.

రావణుడి సభలోకి రాక్షసులు తీసుకు వచ్చిన హనుమంతుడు ఒక్కసారి రావణుడి కేసీ, అతని చుట్టూ ఉన్న రాక్షసుల కేసీ చూశాడు. రావణుడి కళ్ళు కోపంతో ఎర్రబడి ఉన్నాయి. అతను ఆజ్ఞాపించిన మీదట అతని మంత్రులు హనుమంతుణ్ణి ఇలా అడిగారు:

"నువు ఇక్కడికి ఎందుకు వచ్చావు? నిన్ను ఎవరు పంపారు?"

"నేను వానర రాజైన సుగ్రీవుడి దూతను. అతను పంపగా వచ్చాను," అని హనుమంతుడు జవాబిచ్చాడు.

"ఇక్కడికి ఎందుకు వచ్చాడో, అశోకవనాన్ని ఎందుకు ధ్వంసం చేశాడో, రాక్షస స్త్రీలను ఎందుకు భయపెట్టాడో, మన సైనికులతో యుద్ధం ఎందుకు చేశాడో అడుగు." అని రావణుడు ప్రహస్తుడితో అన్నాడు.






ధన్యా స్తే పురుషశ్రేష్ఠా యే బుద్ధ్యా కోప ముత్థితం,
నిరున్ధంతి మహాత్మానో దీప్త మగ్ని మివామ్భసా. 1

[మండే అగ్నిని నీటితో చల్లార్చిన విధంగా, తమకు వచ్చిన కోపాన్ని ఎవరు బుద్ధిచేత నిగ్రహించుకుంటారో అలాటి పురుషోత్తములు ధన్యులు.]

క్రుద్ధం పాపం న కుర్యాత్కః ? క్రుద్ధో హన్యా ద్గురూ నపి,
క్రుద్ధః పరుషయా వాచా నర స్సాధూ నధిక్షిపేత్. 2

[కోపం చేసిన వాడెవడు పాపం చెయ్యడు ? కోపి గురువులను కూడా చంపుతాడు; మంచి వారిపైన కూడా పరుషవాక్యాలు పలుకుతాడు.]

వాచ్యావాచ్యం ప్రకుపితో న విజానాతి కర్హిచిత్,
నాకార్య మస్తి క్రుద్ధస్య, నావాచ్యం విద్యతే క్వచిత్. 3

[కోపం వచ్చినవాడికి ఏది అనదగినదో, ఏది అనదగనిదో తెలీదు; చేయగూడనిదీ, చెప్ప గూడనిదీ అంటూ ఉండదు.]

య స్సముత్పతితం క్రోధం క్షమయైవ నిరస్యతి,
యథోరగ స్త్వచం జీర్ణాం స వై పురుష ఉచ్యతే. 4

[పాము కుబుసాన్ని విడిచినట్టుగా, ఎవడు తన కోపాన్ని ఓర్పుతో వదిలించుకుంటాడో వాడే నిజమైన పురుషుడు.]

Photo by M. Natarajan



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఓడ ఒడ్డు చేరింది

పంపినవారు:
లక్ష్మి అజీజుద్దీన్

Photo by Madangopal



సైదాబాద్,
హైదరాబాద్.

దీపం అవసరం తీరింది

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు డిసెంబర్ 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోష్టుకార్డుపైనమాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు


| | | | |
|---|---|---|---|
| మిత్రభేదం – 30 | ... 2 | రాజుయుక్తి | ... 28 |
| విచిత్రకవలలు–18 | ... 5 | దేవుడుసాక్షి | ... 36 |
| తండ్రికి తగనివాడు | ... 13 | సొంతకొడుకు | ... 40 |
| గట్టెక్కినకష్టం | ... 21 | కలిమి–లేమి | .... 43 |
| పరీక్ష | .... 25 | వీరహనుమాన్ - 15 | ... 45 |


రెండవ అట్ట:
వచ్చే రైలు

మూడవ అట్ట:
పోయే రైలు

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor : NAGI REDDI



కె. వెంకటరామరెడ్డి సమర్పించు రవిరాజ్ కంబైన్స్
సంతానం - సౌభాగ్యం
SKP
ఆంధ్ర: తారకరామ (రఘురామ ఫిలింస్ ద్వారా)
సీడెడ్: నవభారత్
నైజాం: శ్రీ తారకరామ
నిర్మాత: కేశన జయరామ్ దర్శకత్వం: డి.ఎస్. ప్రకాశరావు
STUDIO
Roopkala

Photo by: DILIP BANERJE



DEPARTING

